# ప్రాసంగిక వ్యాసావళి

(మొదటి సంపుటి)



*



డాక్టర్. గుజ్జర్లమూడి కృపాచారి
శ్రీమతి బండారు జ్యోతిస్వరూపరాణి

*

శ్రీ హర్ష ప్రచురణలు,
సుల్తానాబాద్ : తెనాలి.

PRASANGIKA VYASAVALI
First Volume

Dr. GUZZARLAMUDI KRUPACHARY
Smt. BANDARU JYOTHI SWARUPA RANI



ప్రథమ ముద్రణ : 1983

మూల్యము : 15-00

ప్రతులకు :

తెలుగు శాఖ,
నాగార్జున విశ్వవిద్యాలయ
నాగార్జున నగర్ - 522510
గుంటూరు.

# అంకితం



అమృతా ప్రపూర్ణులు

ఆచార్య తూమాటి దొణప్ప దంపతులకు

ప్రేమతో అంకితం.

— కృపాచారి

జ్యోతి స్వరూపరాణి.

# మా మాట



ప్రాసంగికంగా చేసిన రేడియో ప్రసంగాలు ఆయా 'కాన్ఫరెన్స్' 'సెమినార్ల'లో సమర్పించిన పత్రాలు వివిధ రకాల పత్రికల్లో అచ్చయినవి చాలా ఉన్నాయి. అన్నీ ఓ రోజు బేరీజు వేస్తూ వుంటే మిత్రుడు డా॥ భిట్టు వెంకటేశ్వర్లు వచ్చి, చాలా వున్నాయే ! ఓ పుస్తకం అచ్చేయొచ్చను కుంటా' అన్నాడు. అదే ఈ పుస్తకానికి ప్రేరణ. ఆ మాటే గురువుగారితో ప్రస్తావిస్తే ఓకే అన్నారు. అన్నదే తడవుగా పుస్తకానికి పేరేం పెట్టి మంటారని అడిగితే 'ప్రాసంగిక వ్యాసావళి' అన్నారు. మా ప్రథమ విద్యాసంతతికి వారే పేరు సూచించడం మాకు తీరని ఆనందం. అందువల్ల మొదటి గ్రంథాన్ని వారికే అంకితం ఇవ్వడం. అది వారందుకోవడం ఆనందదాయకం.

ప్రాసంగికంగా ప్రారంభించిన ఈ వ్యాస సంపుటి మొదటిది. ఉత్తరోత్తరం ఇదే పేర వ్యాసాలు వెలువరించాలని మా అభిలాష.

అందంగా ముద్రించిన శ్రీపతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు. ప్రూపులు చూడడంలో సహకరించిన విద్యార్థి చిరంజీవి భానుప్రసాద్‌కు ఆశీర్వాదం.

తెనాలి,
1-4-84.

కృపాచారి
జ్యోతి స్వరూపరాణి.

# విషయ సూచిక



తూమాటి దోణప్ప,
కులపతి,
తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

# శు భా శి ష ం



ప్రాసంగిక వ్యాసావళి కృపాచారి దంపతులు రచించిన తొమ్మిది వ్యాసాల సంపుటి. ఇందులో రేడియో ప్రసంగాలు కొన్ని; ఆయా సదస్సులలో సమర్పించిన పరిశోధనా పత్రాలు కొన్ని. ప్రత్యేక సంచికలలో ప్రచురితమైనవి కొన్ని. అన్నింటినీ కలిపి వర్థిష్ణువులు కృపాచారి దంపతులు కూర్చిన అనుషంగిక రచనల సంపుటియే ఈ ప్రాసంగిక వ్యాసావళి.

'నస్త్రీకో ధర్మ మాచరేత్' అని పెద్దల పలుకు. వృద్ధాచార దీక్షాపరుడూ, తంత్రుడూ, విద్యా వినయ విభూషణుడూ, లోక వ్యవహార దక్షుడూ ఐన డా॥ కృపాచారి నిజజీవితంలోనేకాక, సాహితీ జీవితంలోనూ సహధర్మచారిణితోపాటు ధర్మాచరణం చేస్తూ ఉండడం మాకు హర్షవర్ధనమైన అంశం.

ఈ సంపుటిలో మూడోదైన 'ఆంధ్రభాషపై ఆంగ్లభాషా ప్రభావం' అన్న వ్యాసమూ, నాల్గోవదైన 'ఆంధ్ర సాహిత్యం - ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను కృషి' అన్న వ్యాసమూ, కృపాచారి ఉత్తమార్థం శ్రీమతి జ్యోతి స్వరూపరాణి రచనలు. తక్కిన ఏడూ కృపాచారి సొంత రచనలు.

తొలి రెండూ జానపద రంగానికి, తక్కిన ఏడూ భాషా సాహిత్యాల అనుశీలనానికి సంబంధించినవి. మొదటి ఐదూ గతానుగతిక రచనలైనా కొన్ని కొత్త మరుగులు, సరికొత్త మెరుగులూ లేకపోలేదు. చివరి

నాలుగూ అతినూతన విషయ సంభరితాలు. బీజప్రాయంగా పూర్వ పరిశోధకులు చెప్పిన అంశాలపై శాస్త్రీయ విశ్లేషణతో కూడిన మౌలిక రచనలు. 'తెలుగు క్రైస్తవుల వ్యక్తినామాలు' అన్న వ్యాసం ఈ సంపుటికి తలమానికం.

ఋజువర్తనా, నిష్పాక్షికతా, సామాగ్రి సంకలనాసక్తీ, సత్యావిష్కరణ తత్పరతాశాస్త్రీయ విశ్లేషణాసక్తీ, విషయాభివ్యక్తిలో స్పష్టతా సాహిత్య సత్యవ్రతులైన సాధకుల ముఖ్యలక్షణాలని పరిశోధనా పరమేశ్వరుల నిరూపణ. ఈ లక్షణ సంపుటిని వలసినంత సమకూర్చుకుని కృపాచారి దంపతులు ఈ క్షేత్రంలో ఇంకా ఉత్తమకృషి చేస్తారని మాకు గట్టి నమ్మకం ఉంది.

కృపాచారి దంపతులిద్దరూ స్నాతకోత్తర దశలోనూ, పరిశోధనా స్థాయిలోనూ మా అంతే వాసులు. సంతతిని గూర్చి, విద్యాసంతతిని గూర్చి విశేషించి భాషించడం ఉచితం కాదు. వీరి పరిశ్రమ విద్వల్లోకం గుర్తించి నందించినప్పుడే, అభినందించినప్పుడే మాకు నిజమైన ఆనందం. ఈ ఆనందం మాకు కలిగించడానికి వీరు ముందడుగు వేస్తారని ప్రగాఢ విశ్వాసం.

వేసే ప్రతడుగూ ఆచితూచి వేస్తారనీ,

శుభ శుక్రవారం,
ఏప్రిల్ 1, 1988.

తూమాటి దోణప్పం

# జానపదుల దైనందిన జీవితానికి దర్పణం పట్టే స్త్రీల పాటలు.

జానపదగేయాలు జానపదుల ఉద్వేగోత్సాహాలకు కళారూపాలు. పల్లెలలో జరిగే ప్రతి ఉత్సవ కార్యక్రమాలకు, పనిపాటలకు సంబంధించి వారిదైనందిన జీవన ప్రవృత్తిని తెలియజేస్తాయి. ముఖ్యంగా జానపద సాహిత్యం పామర ప్రజలకు వినోదం ఆనందం కలిగించడమేగాక పనిలోని శ్రమను పోగొట్టడం అనేది పరమ ప్రయోజనం ఈ జానపద సాహిత్యంతో స్త్రీలపాటలొక విభాగం. స్త్రీలు నాట్లు వేసేటప్పుడు కలుపుతీసే సందర్భంలోను, కోతలు కోసేవేళల్లోను, తిరుగలి విసిరే సమయాల్లోను, పండగ పబ్బాలకు కోలాటం వేసేటప్పుడు, రోటిదగ్గర దంచేటప్పుడు సందర్భాన్నిబట్టి రకరకాలుగా పాడుకుంటారు.

ఇక స్త్రీలపాటల్లో ఒక యువతి తన అవ్వతో పెండ్లి విషయం ప్రస్తావిస్తుంది. ఆమెకు తగిన వరుణ్ణి తెచ్చి పెండ్లి చెయ్యాలట.

సామల దేశానికి నన్నియ్య బోకవ్వ
నేను తినలేను సామల బువ్వ
వడ్లు బండే దేశానికి నన్నియ్య బోకవ్వ
నేను దంచగ లేను ఆ వడ్లన్నీ
కొఱ్ఱల దేశానికి నన్నియ్య బోకవ్వ
నేను తినలేను కొఱ్ఱాల బువ్వ
జైదల దేశానికి నన్నియ్య బోకవ్వ
నేను తినలేను ఆ జైదరొట్టె
సవతుల మీదికి నన్నియ్య బోకవ్వ
సముద్రం లోతు నే దిగి చూడలేను.

అని అంటుంది. ఎలాగైనా ఈ మహాసాధ్వికి కాస్తంత రాణి పోకడ ఉన్నట్లుంది ఏ పనీ చెయ్యకుండా తిండెలా దొరుకుతుందనుకుందో ? చివరికి సవతులతోడి పోరు సముద్రం లోతు దిగటం వంటిదంటు ఏకరువు పెట్టింది. చివరికెలాగో మంచి సంబంధం చూసి పెండ్లి చేశారు. పుట్టింటి నుండి మెట్టింటికి వెళ్ళేటప్పుడు ఏవిధంగా అక్కడ మసలుకోవాలో అవ్వ ఈ విధంగా అంటుంది.

"మా యింటి లక్ష్మీదేవి
పోయిరావమ్మా
పోయి నీ అత్తింట
బుద్ధి గలిగుండు
ఎవ్వరే మాడిన
ఎదురాడకమ్మ
వీధి నిలుచుండి
తల విప్పి ముడవకుమీ
మాట లెన్నన్నాను
మాటాడకమ్మా
పలుమారు మామీద
ప్రేమలుంచకుమీ
ఆకలున్నాగాని
అని అడగబోకు
అతని కాదని పూలు
ముడవ బోకమ్మా :"

అని చక్కని నీత్యుపదేశం పొంది అత్తింటి కంపబడుతుంది పెళ్ళయిన కొత్తలో స్త్రీల పుట్టింటినుండి మెట్టింటికి ఏవో ఘనంగా

రావాలని కోరుకుంటారు. కొందరయితే పుట్టింటి ఆస్తంతా తనకు ఘనంగా రావాలని కోరుకొనేవారు కూడా లేకపోలేదు. ఈమె తన అన్నతో

కట్టమీది మర్రికాయల్ల మాను
ఆమాను గట్టించి దొడ్ల నాటించి
ఆవుల్ల లేగల్ల ఆ దొడ్డె దోలి
అరణ మిత్తువురార అన్న పెద్దన్న.

అంటు అవులు, లేగలూ తనకు అరణంగా పంపించాలని కోరుకుంటుంది. 'అరణమెక్కడిదే చెల్లి ఆడవారికి'

అని అన్నాడోలేదో ఆమె ఉవ్వెత్తునా లేని "అట్లయితే నీతోడ పుట్టలేదన్నా" అని నిష్కర్షగ అంటుంది. ఈమె కొంచెం గడుగ్గాయిలావుంది. ఇక అన్నయ్య ప్రేమగా

పుట్టితే పూలంచు చీరపెట్టేను
కలిగితే గంధానకాళ్ళు కడిగేను
కాళ్ళు కడిగిన నీళ్ళు కాల్వలై పారేను
చేతులు గడిగిన నీళ్ళు చెలమలై పారేను.

అని తనకు గలిగిన దానితో ఘనంగా పెండ్లి చేశానుగదా అని సమాధానం యిస్తాడు. అయినా ఆడపిల్ల కదా ! నిష్ఠూరంగా

మూడేసి పోగుల్ల ధనమునీకుంటె
ముక్కు పోగుల దాన్ని అన్నరో నేను
నాలుగేసి పెట్టెల ధనము నీకుంటె
నక్కరైకల దాన్ని అన్నరో నేను
ఐదేసి పెట్టెల్ల ధనము నీకుంటె
వేళ్ళ ఉంగరము దాన్ని అన్నరోనేను.

అని నిర్దాక్షిణ్యంగా అన్న కలిమిని తనలేమిని చెప్పిపొడుస్తుంది. తయినా అన్నకెంత ఆస్థివుందో ఆమెకు తెలియదా? ఉన్నదంతా ఊడ్చుకెళ్దామంటారు. ఆడపిల్లలు పెండ్లికాగానే.

ఇక అత్తాకోడళ్ళ చిత్తప్రవృత్తిని చూద్దాం. పరంపరంగా అత్తకోడలిని సతాయిచడం మామూలే. తల్లికీ. భార్యకూ మధ్య నలిగేవాడు కూడా కష్టాలకు గురౌంతుంటాడు అప్పుడప్పుడు. ముందుగా అత్తాకోడళ్ళ ఆరళ్ళు ఆలోచిద్దాం!

కోడలా కోడలా ఓ కొత్తకోడలా
పచ్చిపాలమీది మీగడేమాయె
వేడి పాలమీది వెన్నలేమాయె
తేనెకుండమీది తెప్పలేమాయె
నూనెకుండల మీది నురుగులేమాయె—

అని ప్రశ్నిస్తుంది. మనలోమాట. పచ్చిపాలమీద మీగడ. వేడిపాల మీద వెన్న ఉంటుందా! ఇది అత్తపెట్టే ఆరడికాక మరేమిటి? పాపం కొత్తకోడలు కదూ బాధపడుతూ

అత్తనూవ్ బెట్టిన ఆరళ్ళవలన
అట్లబోయి అడవిలో మానుగానైతి
మానన్నగానైతి మంచెలేతూరు
ఆ కన్నగానైతి మేకలారగించు
కాయన్నగానైతి కాకులారగించు
పండన్నగానైతి పక్షులారగించు.

అని తనలోతాను బాధపడింది. ఆనాటికి అదే ఆరడి. ప్రతిరోజూ అయితే సహనం కోల్పోయి కోడలు కొంత ఎదురుతిరిగే అవకాశం

కూడ ఉంది. ఒననాడు పాపం పని అలసటవల్ల కోడలు నిద్ర పోతుందట. అంతలో కోళ్లు వచ్చాయి. పల్లెగదూ ! ఇంట్లో కోళ్లు బాగా పెంచుకున్నారు గాబోలు. కోళ్లు జొన్నలపై బడి తింటున్నాయి.

'అత్తింటి కోడలు త్తమురాలు
చేటజొన్నలు బోసి చెడనిద్రబోయె
కొన్ని జొన్నలుదినె కోళ్లు కనుగొన్నె
అన్ని జొన్నలుదినె అత్త కనుగొన్నె

ఇంకేవుంది చిన్న తప్పదొరికితే చాలు అత్తగారు మండి పడుతుందాయె. కోళ్లు జొన్నలు తిన్నాయని ఆమె కోపంగా

"కోళ్ళిరోవో కొళ్ళి కొడుకు పెళ్ళామా
నీవూ నీమగడూ వేరుండవలెను"

అంటు ఓ హుకుం జారీ చేస్తుంది. అందుకు కోడలు కొంచెం కినుక వహించింది. అంతలో భర్త వచ్చాడు. భార్య వాలకం గమనించి గోముగా

"పచ్చి పసుపు గొమ్మా బంగారు బొమ్మ
ఫణితి నిన్నెవరు ఏమనినారు ?"—

అని అడుగుతాడు. భర్తకోసం కనిపెట్టుకున్నదాయె. వెంటనే అత్తపైవున్న అక్కసం తావెళ్ళగక్కుతూ.

"చింపిరితలాది చీమిడీ ముక్కుది
చీతిరిది మీయమ్మ మనల వేరుండమనెను" -

అని కుండ బద్దలు కొట్టినట్టు చెబుతుంది. అందుకా రాజేంద్ర భోగి వాళ్ళ అమ్మతో

"అమ్మరో మాయమ్మ మముగన్నతల్లీ
వేరుండ మనకేల వెతలు మనకేల
కడగాను బోనేల కోప్పడగనేల
నీ ముద్దు కోడలిని ఏమంటివమ్మా ?" -

అని అడుగుతాడు. అందుకా తల్లి అసలు విషయం కట్టిపెట్టి కోడలిపై నిందమోపలేదనీ. నీతి మాత్రం చెప్పాననంటుంది.

"కొట్టలే తిట్టలే కోపపడలేదు
పొద్దుబోయి పొరుగిళ్ళుదిర గొద్దంటి
వీధిలో కురులిడిసి కట్టవాకంటి
నలుగురిలో పల్లిడిసి నవ్వబాకంటి"

నని చెపుతుంది. ఆ సమాధానంతో తృప్తిపడిన కుమారుడు తల్లిని ఏమీ అనలేక పోయాడు. ఇవి పల్లెలలో సహజమే. ఈ సతాయింపులు అత్తా - కోడళ్ళ మధ్య అట్టే కాలం జరుగుతూ ఉంటే కోడలు సహించలేక భర్తతో

"ఏరుబడితేనె మేలు మగడా - మనం
పొత్తులుంటె పోరు మగడా
ఏరుబడ్డ తెల్లారి ఏకమై మనముండి
ఏకించి పీకించి నూటకొక్క పొగొడికి
మోటదండెడ దొడ్డు మొలతాడు చేయిస్తు
రంగు రంగొంకాయలు గొంగెడన్నీ దెంపి
హంగుగా నేన్మ కొండంగడికి పోయి
పొంగుబొంగే కల్లు బుంగెడంతా దెస్తు" -

నని బీరాలు పలుకుతుంది. వేరుబడ్డ తెల్లారె భర్తకు వెండి మెలత్రాడు చేయిస్తుందట. పైగా భర్తకు బుంగెడు కల్లు తెస్తుందట.

అబ్బో! కడివెడు కల్లే! కాలం యిలా గడుస్తూ ఉంది. కొంత కాలానికి ఆమె నెలతప్పింది. ఆమెకు దానిమ్మ పండ్లపై ఆశ కల్గిందట.

"మన ఇంటి యెనకాల దానిమ్మసెట్టో
దానిమ్మ చెట్టున్నాది నాయుడప్పన్నో
తింటేను దాన్నిమ్మపండే తినాలి.
కంటేను తొలిచూలు కొడుకునే కనాలి" -

అంటూ దానిమ్మ పండంటి కొడుకును కనాలని ఉవ్విళ్ళూరుతుంది. పైగా తొలిచూలు మగబిడ్డను కంటే కోటయ్య కొండకూ, తిరుపతికీ వస్తానని -

"కోటాకు యెల్లాలి
కోటాకు యెల్లాలి
కోటప్పకొండకు
యెల్లి రావాలి
కోటప్ప తిరుణాలు
సూసి రావాలి
కొండాకు యెల్లాలి
కొండాకు యెల్లాలి
కొండాల తిరుపతి
యెక్కి రావాలి
యేడు కొండలోడ్ని
సూసి రావాలి
అలివెలు మంగమ్మ
అలుగూలు తీర్చగ
పోయిరావాలి

అలివేలు కుంకుమ
అంది రావాలి"

అని మొక్కు కుంటుంది. ఇంక నెలతప్పిన స్త్రీలకు నెలనెల వారిలో కలిగే మార్పులు అభిరుచులు ఈ క్రింది గేయంలో వివరింప బడ్డాయి.

"ఒకోక్క మాసం నెల తన గర్భిణీ
ఓ నగాయగోరే చెలియా ఒనగాయ కోరే."

అంటే మొదటి మాసంలో చింతకాయలు తినాలనే కోరిక కలిగిందట.

"రెండవ మాసం నెల తన గర్భిణీ
రేగుపండ్లు గోరే చెలియా
రేగు పండ్లు గోరే
మూడవ మాసం నెలతన గర్భిణీ
ములగపండ్లు గోరే చెలియా
ములగపండ్లు గోరే
నాలుగో మాసం నెలతన గర్భిణీ
నారికేళ కోరే చెలియా
నారికేళ గోరే
ఐదో మాసం నెల తన గర్భిణీ
అరటిపళ్ళు గోరే చెలియా అరటి పండుగోరే
ఆరోమాసం నెల తన గర్భిణీ
ఆవుపాలుగోరే చెలియా
ఆవుపాలు గోరె
యేడో మాసం నెలతన గర్భిణీ
వెన్నముద్ద గోరే చెలియా వెన్నముద్ద గోరే

యెనిమిదో మాసం నెల తన గర్భిణీ
వెలగ పండ్లుగోరే చెలియా
వెలగపండ్లు గోరే చెలియా
తొమ్మిదో మాసం నెల తన గర్భిణీ
దోసపండ్లు గోరే చెలియా దోసపండ్లుగోరే
పదియవ మాసం నెలతన గర్భిణీ
పాపడు జన్మించె చెలియా
పాపడు జన్మించె"

ఈ విధంగా పదిమాసాలు రకరకాల రుచులారగించి పండంటి పాపను కన్నదాకోడలు. అరళ్లు పెట్టే అత్తగారికి కావలసి నంత పని పాపాయిని ఆడించడంలో.

ఈ విధంగా జానపద సాహిత్యంలో స్త్రీల పాటలు రకరకాలుగా ఉంటాయి. అసలు జానపద గేయాలు ఒక కవిగాని కవయిత్రిగాని రచించినవి కావు. పల్లె ప్రజానీకపు హృదయాల్లో నుండి ఆశువుగా వెల్లుబికి వచ్చిన కవిత. జానపదుల నిత్యజీవితంలో ప్రతిఘట్టాన్ని అమాయిక అకల్మష హృదయ తంత్రుల్ని యిట్టే స్పందింపజేస్తాయి. ఆయా సందర్భాన్ని బట్టి చేసే పనులతో తగిన నడకతో, లయతో రసానుగుణ్యంగా సంగీత సాహిత్యాలు ఏకకాలంలోనే ఉబికివస్తాయి. జానపద సాహిత్యం తేనసోనలూరు. తియ్యనిభాష. మిసిమి మీగడ దేరిన నుడికారాలు. వొయ్యారమొలుకు సూక్తులు మంజుల వర్ణనల కలయికతో సాగుతుంది. ఈ సాహిత్యప్రభావంతో మూలబడకుండ గ్రంధస్థం చేయగలిగితే ముందు తరాలు కూడ ప్రాచీన తెలుగు

సాహిత్యాన్ని తెలుసుకోగల్గుతారు. ఈ జానపద సాహిత్యంలోని స్త్రీల పాటలు కొన్ని అణువులు మాత్రమే.

ఆకాశవాణి. విజయవాడ.
17-12-1974
ఈనాడు : 15-6-1975

## ఆధార గ్రంథ సూచిక

గంగప్ప. ఎస్ : జాతికి ప్రతిబింబం-జానపద సాహిత్యం.
గంగాధరం. నేదునూరి : మిన్నేరు.
దొణప్ప. తూమాటి : జానపద కళా సర్వస్వము
,, (సం) త్రివేణి.
రామరాజు. బి : తెలుగు జానపదగేయ సాహిత్యము
సుందరం. ఆర్వీయస్ : జానపదసాహిత్య స్వరూపం.

# తెలుగు బుర్రకథలు – క్రైస్తవ రచయితలు

జానపద కళారూపాలన్నింటికీ మొదటి మూర్తి పురాణ ప్రవచనకారుడు (పౌరాణికుడు). ఇతనికి వాద్యకారులు తోడుకాగా హరికథకుడు అవతరించాడు. ఏకపాత్రాశ్రయమైన జానపద కళా రూపాలలో హరికథ మొదటిది. హరికథకుని ఆదర్శంగా తీసికొని బహుపాత్ర ప్రధానమై అలరింపజేసేది యక్షగానం ముఖ్య కథకునికి యిద్దరు హంగుదార్లు (వంతలు) తోడుకాగా ఏర్పడిన ప్రదర్శనా విశిష్టమైన ప్రచారసాధనం బుర్రకథ. దీన్నే తందానతాన అని, పల్లవి వంతలు చెప్పి నందువల్ల తందానతాన కథ అనీ, రెండు తంత్రులుగల వాద్యవిశేషం ముఖ్యకథకుడు వాడినందువల్ల జమళిక కథ, జముకులకథ అనీ, జంగం తెగకు సంబంధించినవారు ఈకథను విస్తృత ప్రచారం గావించి నందువల్ల జంగంకథ అనీ, జోడుగమ్మ టాలు వంతలు వాడిన కారణాన గుమ్మటపు కథ అనీ, గుమ్మటాలు అనే బుర్రలు వ్యవహారం వున్నందువల్ల బుర్రకథ అనీ రకరకాల పేర్లున్నాయి.

బుర్రకథలో సాధారణంగా పురుషుడే కథ చెప్తాడు. ఇతడు తంబూరగాని సితారగాని పుచ్చుకొని కథ చెపుతుంటే యిరుప్రక్కల యిద్దరు స్త్రీలు గుమ్మటాలు వాయించుతూ హాస్యం చెపుతారు. అందుకనే ఈ కథకులు యిద్దరు స్త్రీలను వివాహం ఆడడం కద్దు.[1] పల్లెటూళ్ళలో పనివత్తిడి తగ్గిన రోజుల్లో ఊరూరు తిరిగి రాత్రి 9 గంటలకు ప్రారంభించి తెల్లవారేదాకా కథ చెప్పడం నేటికీ అక్క డక్కడ కన్పిస్తుంది. ఈ ప్రచార కళ క్రీ. శ. 12 వ శతాబ్దం నాటికే

(1) శ్రీనివాస చక్రవర్తి, ఆంధ్ర దర్శిని, పుట 852.

నాటకమాత్రంగా ఉన్నట్టు పండితారాధ్య చరిత్రవల్ల కొంత అవగాహన అవుతుంది.[2] ఈ అభినయం బుర్రకథ అనలేము కాని తత్పూర్వమైన పురాణ ప్రవచనకారుని మూర్తిమత్వం బోధ పడుతుంది.

క్రీడాభిరామంలో సమకాలిక ప్రజల జీవన విధానాలను ప్రతిఫలింపజేసే ఘట్టాలు కళ్ళకు కట్టినట్టు చిత్రీకరిస్తాడీకవి. పల్నాటి వీరగాథాగానాభినయములో

వ:॥ ద్రుత తాళంబున. వీరగుంఫికత ధుంధుంధుంకిటాత్కార సంగతి వాయింపుచు. నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా. యతి గూడనే. ద్విపద ప్రబంధంబున వీరానీక ముంబాడెనొక్కతె. ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్॥ – 116

ఇక్కడ మద్దెల వాయిస్తూ ఒకతె పాట పాడింది. అది బుర్రకథే కాక పోవచ్చు. కాని దాని పరిణామమే నేటి బుర్రకథ అని విజ్ఞుల అభిప్రాయం.[3]

క్రీడాభిరామములోనే అదే ప్రకరణంలో మాలెత– ఏకవీరా కీర్తనము చేసే సందర్భంలో

---

(2) పాల్కురికి సోమనాథకవి, శ్రీ పండితారాధ్య చరిత్రము, చెన్నపురి. పర్వత ప్రకరణము, పుటలు 436–438.

(3) రామచంద్ర, తిరుమల సాహితీసుగతుని స్వగతం, ద్వితీయముద్రణ, పుట 10.

మ॥ 'అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బహ్మానంద భావంబునన్
సకలానందమయైక మంత యగుచున్ సంతోష చిత్తంబునన్
తక దుం దుమ్ములు తాళముల్, జవనికల్, తందాన,
లమ్మయ్యకు
న్నేక వీరమ్మకు, మాహురమ్మకు, నధోహ్రింకార
మధ్యాత్మకున్॥' - 13

సంతోష చిత్తంతో భక్తిభావంతో భగవదారాధనం చేసే సందర్భంలో రాగ, తాళములతో తందాన పాడుచు కీర్తించినట్లు బోధపడుతుంది. ఇది ముమ్మూర్తులా బుర్రకథే అని నిర్ధారించ వచ్చు. అయితే వంతలున్నారా అన్నదే సందేహం.

ప్రజాదరణను గమనించిన శ్రీనాథుడు పల్నాటివీర చరిత్రను మంజరీ ద్విపదలో మలిచాడు. మనకు లభ్యమవుతున్న బుర్రకథల్లో ప్రాచీనమైనదీ ఉత్తమమైనదీ పలనాటి వీరచరిత్ర అని తోస్తుంది.[4] ఆపై వచ్చిన బుర్రకథల్లో రామాయణ భారత గాథలు, బొబ్బిలి కథ, కామమ్మకథ ముఖ్యమైనవిగా పేర్కొనవచ్చు. పూర్వం ఈ కళను వృత్తిగా స్వీకరించిన వారిలో రెంటపాళ్ళ గుడ్డిజంగం బృందాన్ని ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. ధేనువకొండ వెంకయామాత్యుడు రచించిన ఉత్తరగోగ్రహణంలో ద్విపదలతోపాటు కీర్తనలు, దరువులు చోటు చేసుకుంటే ఈ పద్ధతికి విస్తృత ప్రచారం గావించినవారు దొడ్డవరపు వేంకటస్వామి.[5]

ఇంతవరకు పురాణ సంబంధమైన వాటిని బుర్రకథగా ప్రచారం గావించడం జరిగింది. ప్రజాసమస్యలకు ప్రాణంపోసి

---

(4) ఆంధ్రదర్శిని, ఆంధ్రనాటక కళాపరిణామం, పుటలు 282,283.
- రామరాజు, బిరుదురాజు, ప్రవేశిక, పుట 33.

(5) పైదే

ప్రజలముందుకు బుర్రకథారూపంలో నడిపించినవాడు సుంకర సత్యనారాయణ. వీరి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, వీరేశలింగం మొదలైనవి ఇందుకుదాహరణలు.

ఈ విధంగా సాహసికులు, సహగమనం చేసిన సతీమతల్లులు, సంఘసంస్కర్తలు, రాజకీయ నాయకులు, రాజకీయోద్యమాలు మొదలైన యితివృత్తాలతోపాటు బాబాలు స్థలమాహాత్మ్యాలు మొదలైనవికూడ ఈ బుర్రకథలో చోటు చేసుకున్నాయి. ఈ ప్రచాల కళను గమనించిన క్రైస్తవ మతానుయాయులు క్రీస్తుమత సంబంధమైన యితివృత్తాలను తీసికొని బుర్రకథలు రచించారు.

క్రైస్తవ బుర్రకథా రచయితలను వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. ముఖ్యంగా గేరా ప్రేమయ్య దాదాపు 45 బుర్రకథలను రచించి నేటికి కథాగానం చేస్తున్నారు. ఇంకా చిన్నాబత్తిని మైకేల్ కవి, జొన్నకూటి ప్రకాశం, పలుకూరి సత్యానందం, ఈదులమూడి ఐజక్, స్లీవశ్రీ, తోటశౌరి ప్రభృతులు రచయితలుగాను, కథకులు గాను కొనసాగుతున్నారు. కథాగానంచేసి వారిలో ముఖ్యవృత్తిగా స్వీకరించిన వారు ఈ కోవలో దాదాపు లేరనేచెప్పాలి. ఉపవృత్తిగా స్వీకరించిన వారిలో సి. బెనర్జీ, హైదరాబాదు. ధర్మయ్య, మస్తాన్‌రావు, అంకిరెడ్డిపాలెం సత్యంబృందం, పిచ్చుకలగుంట, క్రైస్తవ ఆశ్రమం విద్యార్థులు, గుంటూరు, రెవ కె. ఎస్. ప్రకాశరావు బృందం, గుంటూరు. గంగోలు మోజెస్, స్టూవర్టుపేట. శ్రీరాములు, మోదుకూరు. తలతోట యోసేపు, నడిగడ్డపాలెం, బుద్ధాజోసఫ్, నందిగామ, ఇంకాసి. ఎచ్. పాలస్, పి. ఐజక్, సాధుసుబ్బయ్య, వి. రత్నం, బి. జాన్ ప్రభృతుల కథాగానంచేస్తున్నారు.

సాధారణంగా బుర్రకథలు శుభాశుభ సమయాల్లో చెప్పడం పరిపాటి. పెళ్ళిళ్ళకూ, తద్దినాలకు ఇళ్ళవద్ద ఏర్పాటుచేస్తే పండుగలకు మహామహుల జన్మదినోత్సవాలకు ఆలయప్రాంగణంలో జరిపే

సందర్భంలోనూ. పంటచేతికివచ్చి క్రైస్తవులు కోత పండుగ (దశమభాగ దైవార్పితం చేసే పండుగ) చేసే రోజుల్లోను పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ వార్షికోత్సవాలు జరిపేరోజుల్లో క్రైస్తవ మహాసభలు జరిగే సందర్భల్లోనూ. సాధారణంగా రాత్రిపూట బుర్రకథ ఏర్పాటుచేస్తారు. అక్కడక్కడా పగలుచెప్పిన సందర్భాలు కూడ లేకపోలేదు. కొన్ని ప్రాంతాల్లో కథను కూర్చుండి చెప్పడం కూడ ఉంది. కాని నిలుచుండి చెప్పడమే విరివిగాగల పద్ధతి.

క్రైస్తవ రచయితలు రచించిన కథలను బైబిలు కథేతివృత్తాలు. చారిత్రకమైనవి. జీవిత చరిత్రలూ. వయోజనవిద్య. రాజకీయ సంబంధమైనవి. మొత్తం ఐదు భాగాలుగా వర్గీకరించడం జరిగింది.

బైబిలు కథేతి వృత్తాల్లో బైబిలులోని ఇతివృత్తాలు మాత్రమే కథలుగా స్వీకరించడం జరిగింది. అందులో పాతనిబంధన కథలు. క్రొత్తనిబంధన కథలు వేర్వేరుగా ఉన్నాయి. పాత నిబంధన కథల్లో ఎలీషా చరిత్ర వీరసంసోను. యేసేపు చరిత్ర. పది ఆజ్ఞలు. ఎస్తేరు చరిత్ర మొదలైనవి. క్రొత్తనిబంధన కథల్లో క్రీస్తుజననం. క్రీస్తు శ్రమలు-మరణపునరుద్ధానం. స్నానికుడైన యోహాను. భక్త పౌలు చరిత్ర. తప్పిపోయిన కుమారుని చరిత్ర మొదలైనవి ఈ కోవలోకి వస్తాయి.

చారిత్రకమైన వాటిల్లో మహారాజుల నుంచి సామాన్యుల వరకు క్రీస్తును అంగీకరించి క్రైస్తవులుగా మారిన ఘట్టాలు వివరించడం జరిగింది. ఈ కోవలో పువ్వులగంప చరిత్ర. మంగళ మందిరం చరిత్ర మాత్రమే లభించాయి.

జీవిత చరిత్రల్లో డాక్టర్. కుగ్లర్. భక్త డాన్‌బోస్కో. సాధు సుందర సింగు. పెద అవుటపల్లి జోజప్పగారి చరిత్ర. పండిత రామాబాయి మొదలైనవి ముఖ్యములు.

వయోజన విద్యాకార్యక్రమాలలో చదువుతున్న రైతుబిడ్డ కనకయ్య కథ చదువులేని బాపయ్య కథ మొదలైనవి ఉన్నాయి.

రాజకీయ సంబంధమైన వాటిల్లో ప్రముఖ రాజకీయ నాయకుల దేశభక్తులను గూర్చిన చరిత్రలు ముఖ్యములు. వీటిల్లో అమరజీవి పొట్టి శ్రీరాములు చరిత్ర. నెహ్రూకథ. బాల గంగాధర తిలక్ బుర్రకథలు ముఖ్యమైనవి. అత్యయిక పరిస్థితిలో ప్రధాని ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమాన్ని గూర్చిన కథకూడా ప్రత్యేకంగా పేర్కొనవచ్చు.

బుర్రకథల్లో వాడిన ఛందస్సును పర్యావలోకనం చేస్తే అన్ని కథల్లోను రగడలు. పాటలు సర్వసాధారణం చిన్నాబత్తిన [illegible] కవిగారి రచనల్లో అంత్యప్రాసలతో కూడిన రగడలు, దండకాలు, సుదీర్ఘ సమాసాలు ప్రత్యేకం. ఆధునికంగా సినిమాల ప్రభావం హెచ్చుగా ఉన్నందువల్ల ఆయా సినిమా పాటల రాగాలతో పాటలు రచించి చెప్పించిన కథలూ ఉన్నాయి.

క్రైస్తవ మత ప్రచారం కోసం ఏర్పడిన రేడియో రికార్డింగ్ కేంద్రం విజయవాడలోని సువార్తవాణి. ఈ కేంద్రం ద్వారా రికార్డు అయి ఆకాశవాణి ద్వారా ప్రసారం అయిన కథలుకూడ ఈ భాగంలో పొందుపరచడం జరిగింది. శ్రీ సి హెచ్. పాలస్‌చే గానం చేయబడిన స్నానికుడైన యోహాను. క్రీస్తు జననం. పౌలు చరిత్ర. ఏకసంసోను, భక్తయోసేపు. మృత్యుంజయుడు. శ్రీ సాధుశేషయ్య గానంచేసిన మంగళ మందిరం. శాంసన్ డెలీలా. యోబు చరిత్ర విస్తైరుకథ. క్రీస్తుపునరుత్థానం. క్రీస్తు చరిత్ర. క్రీస్తు పుట్టుక. చెంచు కథ. శ్రీ [illegible] బృందం చెప్పిన రైతుబిడ్డ. కనకయ్యకథ. చదువురాని బాపయ్యకథ. మృత్యుంజయుడు మొదలయినవి ముఖ్యములు.

ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్
గుంటూరు. 1984. మార్చి. 3,5.

# ఆంధ్ర భాషపై ఆంగ్ల భాషా ప్రభావం

శ్రీమతి బండారు జ్యోతిస్వరూపరాణి,

భాష ఒక ప్రవాహంలాంటిది ఒక ప్రవాహంలో ఎన్నో నదులూ, ఉపనదులూవచ్చి ఐక్యం చెందినట్టు ఒక ప్రధానభాషలో కాలక్రమాన ఇతర భాషాపదాలూ సంప్రదాయాలూ చేరి విలీనం కావచ్చు. అలాగే ఒకేభాష ఎన్నోపాయలుగా విడిపోయి వైయక్తిక మైన ప్రవృద్ధిచేత ప్రత్యేక భాషానిర్మాణం సమర్థం కావచ్చు. పై సంశ్లేషానికీ విశ్లేషానికీ చారిత్రక సామాజిక రాజకీయాది ఘటన లేవైనా కారణాలు కావచ్చు.

ఆరుకోట్ల ఆంధ్రుల మాతృభాష తెలుగు. ఆంధ్ర అనేది జాతివాచకం. ఐతరేయమను ఋగ్వేద బ్రాహ్మణంలో ఆంధ్రులు జాతిపరంగా పేర్కొవడం వల్లనూ, గౌతమ బుద్ధుని కాలం నాటికే గోదావరి తీరంలో ఆంధ్రులు నివసించారనీ, క్రీస్తు పూర్వం నాల్గవ శతాబ్దంలో మగధను పాలించిన చంద్రగుప్త మౌర్యుని ఆస్థానంలో ఉన్న గ్రీకు రాయబారి ఆంధ్రుల గూర్చి ప్రస్తావించినందువల్లా ఆంధ్రజాతి ప్రాచీనత నిర్ధారించవచ్చు. తెలుగు అన్నది త్రిలింగ దేశ శబ్దభవం. శ్రీశైల, కాళేశ్వర, దక్షారామములనే మూడు శివలింగ ముల మధ్యవున్న ప్రజలను 'త్రిలింగాఖ్యులు' గా విద్యానాథ కవి తన ప్రతాపరుద్రీయంలో పేర్కొన్నందు వల్ల తెలుగువారయారని భాషాపరంగా కవి చమత్కరించాడు. అయితే తెనుగు అని నన్నయ భట్టు ప్రాసఘటితంగా వాడిన దానికి తెన్ అంటే దక్షిణం అనీ దక్షిణాన ఉన్నవారు తెనుగు వారనీ దిగ్వాచిగా సమన్వయిస్తే

తేనె అగు భాష తెనుగుభాష అని మరో చమత్కారం. పాశ్చాత్యులు భరత దేశానికి వాణిజ్యం పేర వచ్చి తెలుగువారినే వరుగి, జంటూ అనే వ్యవహరించిన సందర్భాలుకూడ లేకపోలేదు. జాతిపరంగ ఆంధ్రులైతే భాషాపరంగా తెలుగువారని నేటి నిర్ధారణ.

భారతదేశానికి పాశ్చాత్యదేశాలతో క్రీస్తుకు పూర్వం నుంచే నౌకాయానంద్వారా వాణిజ్యం జరిగినా అది నామమాత్రమే. 15వ శతాబ్దంలో వాస్కోడిగామా కళ్ళికోటకు చేరుకోవడంతో పాశ్చాత్య దేశాలతోటి వర్తకవాణిజ్యాలు మూడుపువ్వులు ఆరుకాయలుగా విస్తరిల్లింది. ఆ వాణిజ్యంతోపాటు క్రైస్తవ మత ప్రచారకులు వారితోపాటు నిత్యోపకరణానికి కావలసిన వస్తువులు, కూరగాయులు, సంభారు మొదలైనవి దేశీయమైన పదజాలంలో చేరిపోయాయి. పోర్చుగీసు భాషాపదాల్లో అనాస, అల్మారా, గలీబు, జాల్చి, పొత్తాము, బత్తాయి, బొప్పాయి, కమీజు, పాదిరి మొదలయిన పదాలు యథాతథంగా మనం వాడుతున్నాం. పోర్చుగీసు వారి తర్వాత డచ్చి ఫ్రెంచివారు వచ్చినా వారి భాషా ప్రభావం చాల తక్కువ.

ఆపై ఆంగ్లేయుల పాలన మనదేశంపై సుమారు రెండు వందల యేళ్లు వుంది. దేశీయులెందరో ఆంగ్లవిద్య నభ్యసించారు. విద్యావంతులు ఆంగ్లంలోనే సంభాషించుకునేవారు. భరతదేశానికి మొట్టమొదట వచ్చిన ఇంగ్లీషు వ్యక్తి ఫాదర్ స్టీవెన్స్ (Father Stevens). ఇతను Society of Jesus సంస్థకు చెందిన వాడు. ఆపై ఆంగ్లేయుల రాక వ్యాపారంతో ప్రారంభమయి రాను రాను క్రైస్తవమత ప్రచారం కొనసాగింది. భరతదేశంలో ఆంగ్ల విద్యా వ్యాప్తికి బీజం వేసినవాడు సర్ థామస్ మన్రో. ఆ బీజాన్ని శాఖోప శాఖలుగా విస్తరింపచేసినవాడు రాజారామ మోహనరాయలు.

భారతదేశంలో ఇంగ్లీషు విద్యకు రాజారామమోహనరాయలే మూల పురుషుడని చెప్పాలి. ఆంగ్లవిద్యావ్యాప్తి ఫలితంగా 1812 లో మద్రాసులో కళాశాల స్థాపనం. ఆ కళాశాలలోనే కాంబెల్, విలియం బ్రౌన్ ప్రభృతులు తెలుగు నేర్చుకుని తెలుగు వ్యాకరణాన్ని ఇంగ్లీషులో రచించారు. ఆపై ఆంగ్లవిద్యావ్యాప్తికి అధికంగా ప్రచారం లభించడంతో ఆ భాషా వ్యామోహంవల్ల కానీ, ఆంగ్లంలో మాట్లాడితే గౌరవ ప్రపత్తులు పెరుగుతాయని ప్రజలలో ఏర్పడిన నమ్మకం వల్ల కానీ ఆంగ్ల భాషను అభసించేవారు ఎక్కువ అయారు. ఇంత వరకు ఆంగ్ల విద్యావ్యాప్తికి కావలసిన చారిత్రక నేపథ్యం మాత్రమే వివరించడం జరిగింది.

ఆంగ్ల భాషావ్యాప్తి చెందడంతోపాటు ఇతర దేశాలనుండి మనం ఎరవు తెచ్చుకున్న వస్తుసామగ్రి, పదజాలం నిత్యవ్యవహారంలో గిలిచిపోవడానికికూడా కొన్ని కారణాలు లేకపోలేదు. దేశీయమైన వ్యవహారంలో విదేశీయాలు చోటుచేసుకోవడం తత్సంబంధమైన పదాలు ఆంధ్రభాషలో లభించకపోవడంవల్ల కూడ ఆంగ్ల భాషా రూపాలు యథాతథంగా స్వీకరించడం జరిగింది. వాటిల్లో రైలు, రోడ్డు, బస్సు, పోలీసు, కోర్టు, హోటలు, కలెక్టరు, కంపెని, కోర్టు సమను మొదలగు రూపాలు ఉదహరించవచ్చు. అయితే తెలుగు అజంతమైన భాష కావడంవల్ల అన్ని అచ్చులతోనే అంతం కావడంలో విశేషమేమీ కన్పించడం లేదు. అందునా ప్రత్యేకతకూడ కన్పించదు. పోలీస్–పోలీసు, కోర్ట్–కోర్టు, కలెక్టర్–కలెక్టరు, రైల్–రైలు, బస్–బస్సు, బేంక్–బ్యాంకు, మేనేజర్–మేనేజరు, ఏజెంట్–ఏజంటు మొదలైన రూపాల్లో మార్పు కన్పించకపోవడం విశేషంగా పేర్కొవచ్చు. వీటినే తత్సమ రూపాలుగా వ్యాకరణ కర్తలు పేర్కొంటారు.

బ్రదర్, సిస్టర్, ఫాదర్, మదర్, అంకుల్, ఆంటీ, మదర్ ఇన్లా, ఫాదర్ఇన్లా అనే సంబంధబాంధవ్యాలను యథాతథంగా వాడుతున్నారు. మానాన్న అని పరిచయం చేయడానికి బదులుగా మా ఫాదర్ అనో మా మదర్ అనో మా బ్రదర్, మా సిస్టర్ అని పరిచయం చేయడం సంఘంలో ఈనాడు గౌరవం అనే భావన చాలామందిలో ఏర్పడినందువల్ల ఆవిధంగానే వ్యవహృతం రావడం విశేషంగా కన్పిస్తుంది. ఇది ఆయావ్యక్తుల ఆర్థికస్థితి బట్టికూడా కొంత కన్పించవచ్చు.

అన్యభాషాపదాలు వచ్చిచేరేటప్పుడు వాటి ఉచ్చారణకు అను కూలమైన అనాంధ్రవర్ణాల్లో ఫౌంటెన్‌పెన్, కాఫీ, ఫాదర్, ఆఫీసులలో 'ఫ' అనే అక్షరం తెలుగులో లేదు. తెలుగులోని ప, ఫలలో 'ఫ' అనే వ్యవహృతం. అలాగే Advocate, Act, Bank, Balance మొదలగు పదాలలో Advocate - అడ్వకేటు, Act - ఆక్టు Bank - బ్యాంకు, Balance - బ్యాలెన్సుగా రూపాంతరం చెందాయి. ధ్వన్యాత్మకంగా ఏ - ఆగా - బే - బా గా మార్పు చెందడం కేవలం ఆంగ్ల భాషా సంప్రదాయం, ఆంధ్ర భాషలో లేనందువల్ల వచ్చిన మార్పుగా గమనించవచ్చు.

సర్వసాధారణంగా యితర భాషా పదాలు దేశీయ భాషలో లేనప్పుడు యథాతథంగానే స్వీకరించడం ఆనవాయితీ. అనువాదాలు అసహజంగానూ కొండొకచో అశ్లీలంగానూ కన్పిస్తాయి. రైల్వే స్టేషను అనే పదాన్ని అలా ఉచ్చరించడమే తేలిక. ధూమశకట గమనాగమనస్థానం అంటే కృత్రిమంగానూ కఠోరంగానూ వుంటుంది అలాగే పురుషుల మెడకు ధరించే టైని 'టై'-అనే అనాలి. గొంతు గోచి అంటే ఎబ్బెట్టుగా విన్పిస్తుంది. Bat అంటే బంతిని కొట్టే ఒకానొ

పరికరం. దాన్ని పిల్లలకు పాఠశాలల్లో నేర్పించేటప్పుడు 'బంతికొట్టు కర్ర' అని అర్థంవిశదీకరించడం పరిపాటి. ఇక్కడ అర్థం విశదం చేస్తున్నారేతప్ప ఆ పదస్వరూపాన్ని మార్చడంలేదు. అందువల్ల Bat, Cycle, Tyre, Tube, Fan, Telephone, మొదలైన పదాలు యథాతథంగా స్వీకరించడం జరుగుతుంది. Cat, Rat, Mat, Dog, Boat వగయిరా పదాలకు మాతృ భాషలో పేర్లున్నాయి కాబట్టి పిల్లి. ఎలుక. చాప. కుక్క. పడవ అనే అర్థాలు చెప్పుకోవచ్చు. ఎటొచ్చీ మాతృభాషాబోధకాలు కాని పదాలు మాత్రమే యథాతథంగా స్వీకరించడం జరుగుతుంది.

వాక్యరచనలో ఆంగ్ల భాషా సంప్రదాయానికి తెలుగు భాషా సంప్రదాయానికి కొంత విలక్షణత కన్పిస్తుంది. 'I have five Books' అనే ఆంగ్ల వాక్యరూపానికి 'నేను ఐదు పుస్తకములు కలిగి యున్నాను' అనేది యథాతథాను వాదం. కాని తెలుగు వాక్య నిర్మాణం ప్రకారం నాకు ఐదు పుస్తకా లున్నాయి అంటే సరిపో తుంది. అలాగే 'Mumy is angry with me' అనే వాక్యానికి అమ్మ నాపై కోపముగా నుండెను. అనేది ఆంగ్లాను కరణం. తెలుగు నుడికారమయితే అమ్మకు నామీద కోపంగా ఉంది. అనిగాని అంటే అంత కోపం కూడా అందంగా అతికి పోతుంది. అలాగే 'Rama is a king' అంటే రాముడు రాజై యున్నాడు అనేది ఆంగ్లానుకరణం. తెలుగు నుడికారంలో రాముడు రాజు అంటే సరిపోతుంది. ఆంగ్ల వాక్య నిర్మాణంలోని రీతివేరు. తెలుగు వాక్య నిర్మాణ పద్ధతివేరు. నేటి వ్యవహారికాను వాదాలలో ఆంగ్లభాష నుండి అనువదించే గ్రంథాలు స్వేచ్ఛాను వాదాన్నే కలిగి ఉన్నా యనే చెప్పవచ్చు. ఏ భాషకున్న సంప్రదాయం, నుడికారం, జాతీయత మరోభాషకు యథాతథంగా రావు. అందువల్ల దాదాపు ఆ భాషా సంప్రదాయాన్ననుసరించి వాక్య నిర్మాణం కొనసాగితే వీనుల విందుగా ఉంటుంది.

ఇక నిత్యవ్యవహారంలోకి వస్తే ఆంగ్ల భాషాపదాలు కోకొల్లలు ఈ భాషాపదాలను కొన్ని వర్గాలుగా చేయవచ్చు. నిత్యం గృహిణులు, కార్మికులు, విద్యార్థులు వాడేపదాలు వర్గీకరిస్తే ఆంగ్లభాషా ప్రభావం ఎంతవరకుందో అవగాహన అవుతుంది. గృహిణి ఉదయం లేచిన్నాటి నుండి వంటతో సతమతం కావడం అందరూ ఎఱిగిందే. వంట ప్రారంభించక పూర్వం వేసే స్విచ్, లైట్ తర్వాత కిరోసిన్. గ్యాస్. స్టవ్ బర్నర్. మొదలైన వంటకుపయోగించే ఇంధనాలు తత్సంబంధమైన పరికరాలల్లో కుక్కర్. ప్లేట్. మీల్స్. కరీ టేబుల్. క్లాత్. గ్లాస్. వాటర్ మొదలైన రూపాలు నేడు సర్వసాధారణం అయినాయి. స్టౌవ్. గ్యాస్. గ్లాసు. ప్లేట్ మొదలైన పదాలు యథాతథంగా స్వీకరించడం జరిగింది.

కార్మికుల కయితే ఉదయం నిద్రలేచిన్నాటినుండి ఉద్యోగ నిర్వహణకోసం కుస్తీపాట్లు. వేపపుల్ల. గానుగ. పుల్లలస్థానే పేస్టు. బ్రష్‌లాంటి దంతధావన ప్రక్రియకుపయోగపడే వస్తువులు సర్వసాధారణం అయినాయి. అలాగే సైరన్. బస్. రిక్షా. డ్రైవర్. యూనియన్. ప్రసిడెంట్. సెక్రటరీ. లైట్. టార్చ్. స్పీడ్. రీసెస్. ఫాన్. ఫోన్. గేట్. వాచ్‌మన్ మొదలైన ఆంగ్లపదాలు జనవ్యవహారంలో సర్వసామాన్యమై పోయాయి. అక్షరజ్ఞానంలేని పామరుడైనా 'టైమెంత' అనే అడుగుతున్నాడుగాని 'గంటెంత' అని అడగడం ఎక్కడో నూటికొక్కటో అరో విన్పిస్తుంది. ఎడనెడ అలాంటివి కన్పించినా అధిక ప్రాచుర్యం పొందిన పదసముదాయం ప్రామాణికంగా తీసుకోవచ్చు.

విద్యార్థుల్లో అయితే ఆంగ్ల భాషాపదాలు ఎన్నయినా చెప్పవచ్చు. Pen, Pencil, Rubber లాంటి వాటితో Uniform Book, Socks, Blackboard, duster, Compass Box

Belt, Slidepin, Tiffin Box, Bag లాంటి పదాలు నిత్య వ్యవహారంలో చోటుచేసుకొన్నాయి.

తెలుగు భాషాసంప్రదాయంలో 'లు' వర్ణంబు బహువచనంబని చిన్నయసూరి సూత్రం. ఆంగ్ల భాషలో Tablets, Tubes, Bulbs, Shops, Pins, frocks మొదలైనవి. తెలుగులో టాబ్లెట్లు. ట్యూబులు. బల్బులు. షాపులు. పిన్నులు. ఫ్రాకులుగా వ్యవహారంలో ఉన్నాయి. నిత్య ఏకవచన రూపం అయిన Ice తెలుగులో 'ఐసులు' గా రూపాంతరంచెంది బహువచన ప్రక్రియగా మార్పుచెందినదంటే ఆశ్చర్యపడ వలసిన అవసరం లేదనుకుంటా. ఇక సంబోధనల్లో 'హల్లో' అని ప్రారంభించి 'టాటా' తో ముగించడం ఆంగ్ల భాషా సంప్రదాయం. ఈ ప్రకి9య తెలుగులోకూడ వచ్చి చేరిందడానికి జంకు లేకుండ ఉంది.

మన వేష భాషల్లో కొంతమార్పు పాశ్చాత్యుల వల్ల కన్పించడం సహజం. ఇక ఆంధ్రుల వస్త్రిధారణలో పంచెకట్టు. పైకండువా. పొంకోళ్ళు ప్రాచీనపుటల వాటయితే Pant, Shirt, Boot, చేతిలో సిగరెట్ మొదలైన వేషధారణ గురజాడవారి గిరీశాన్ని మన కన్నులముందు సాక్షాత్కరింప జేసుకోవచ్చు.

ముంగిళ్ళల్లో ముగ్గులు వేసి సంక్రాంతికి గొబ్బెమ్మలు పెట్టడం ఆంధ్రుల సంప్రదాయం. వాటికి తోడు 'Happy pongal' అనో 'Happy New year,' Wel Come to 1985. అనో రాయడం పాశ్చాత్య ప్రభావం.

కాలానుగుణంగా మానవుని భాష. వేషం అన్నీ మారడం సహజం. అయితే ప్రయోగంపేర పూర్తిగా దేశీయమైన పద్ధతిలో అనువదించి ప్రయోగించాలను కోవడం ఛాందసం అవుతుంది.

ఈమధ్యకాలంలో తెంగ్లీషు (తెలుగు+ఇంగ్లీషు తెంగ్లీషు) పదాలు సంకరజాతిగా అక్కడక్కడా విన్పిస్తున్నాయి. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు దూలాలను 'దూలమ్స్' అనే వ్యవహరిస్తారు. అలాగే జన వ్యవహారంలో హోటల్లో రుబ్బేవాడిని 'రుబ్బిగ్' అనీ దుప్పట్లను 'దుప్పట్స్' అనీ, నరాలను 'నరమ్స్' అనే వ్యవహారం ఈ లెక్కన భాష ఏవైపు వెడుతుందో మరి ఊహించలేం.

తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం అన్న అంశంపై విస్తృతమైన పరిశోధనాలు చేసిన వారిలో ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య జి. యస్. రెడ్డి ఆచార్య తూమాటి దోణప్ప ప్రభృతులు ముఖ్యులు. ప్రస్తుతం నిత్యవ్యవహారంలో ఉన్న భాషా పదాలనుకొంత క్రోడీకరించి పరిశోధన చెయడం అత్యంత ఆవశ్యకం. ఆంధ్ర సాహిత్యంపై ఆంగ్ల భాషా ప్రభావం అన్న ఈ ప్రసంగం కేవలం విహంగావ లోకనం మాత్రమే, అదీ పాక్షికమే.

ఆధార గ్రంధ సూచిక

దోణప్ప, తూమాటి : భాషా చారిత్రిక వ్యాసావళి.
నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము
మోహన్, కె. ఆర్. కె. : పాశ్చాత్య విద్వాంసులు
తెలుగు భాషా సంస్కృతులు
రామచంద్ర తిరుమల : మినలిపి పుట్టు పూర్వోత్తరాలు
విజ్ఞాన సర్వస్వము : సం. 3, 4
వీరభద్రరావు, కె. : తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము
శ్రీ : మాటలతో మంతనాలు

ఆకాశవాణి, విజయవాడ.
2-3-1984

# ఆంధ్ర సాహిత్యం - ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ కృషి

శ్రీమతి బండారు జ్యోతి స్వరూపరాణి.

తెలుగు భాష పది కాలాలపాటు పచ్చపచ్చగా బతుకుతూ ఉండనటానికి ముఖ్యకారకుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్. ఆంధ్ర వాఙ్మయోద్ధారణ ఒక మహాయజ్ఞంగా చేసిన విజ్ఞానతపస్వి ఆయన. తెలుగుకు సంబంధించిన నిఘంటువులు, వ్యాకరణాలు, ఛందో గ్రంథాలు, రచించడమేకాక మనుచరిత్ర, వసుచరిత్రాది కావ్యాలు, వేమన పద్యాలు, శతకాలు, భారతభాగవత రామాయణాలు నూరార్లుగా అసూర్యంపశ్యలుగా ఉన్నవాటిని చీకి శిథిలమై పోతున్న వాటిని వెలికితీసి దుమ్ముదులిపి ముద్రించాడు. కొన్నింటికి వాఖ్యానాలు వెలయింప జేశాడు. కొన్నింటికి తానే లఘుటీకలు సంతరించాడు.

ఆంధ్ర భాషాభివృద్ధికై తన జీవితకాలాన్ని వెచ్చించిన బ్రౌన్ కలకత్తాలో 1798 సం॥ నవంబరు 10న రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ కౌలే దంపతులకు జన్మించాడు. పువ్వుపుట్టగానే పరిమళిస్తుందన్నట్టు బ్రౌన్ 14 ఏళ్లకే హిబ్రూ, సిరియన్, అరబ్బీ, పార్సీ గ్రీకు, లాటిన్, హిందూస్థానీ భాషాధ్యయనం చేశాడు. 1817 ఆగష్టు 13న మద్రాసు కాలేజీలో చేరినప్పుడు తెలుగుభాష ఒకటుందని తెలుసుకున్నాడు. అంటే బ్రౌనుకు దాదాపు 20 సంవత్సరాల ప్రాయం వచ్చేవరకు తెలుగుభాష ఉనికి తెలియలేదు. తెలుగుభాషను వెలగపూడి కోదండ రామ పంతులుగారి ద్వారా నేర్చుకున్నాడు. భాష నేర్చేటప్పుడే బ్రౌనుకు పరాయిభాష నేర్పించేవాడి బాధ, నేర్చుకునేవాడి వ్యథ తెలిసింది. భాష నేర్చుకునేవాడి బాధలు, ఇబ్బందులు గమనించి

నందున తెలుగు భాషా వ్యాకరణం రాయాలనే తలంపు. కొత్తగా తెలుగు నేర్చుకొనేవారికి 'తెలుగు రీడరు' అనే పుస్తకం తయారు చేయాలనే ఆలోచన కలిగింది. బ్రౌను చాలా మంది పండితులవద్ద భాషాధ్యయనం చేశాడు. వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రిగారిని ప్రత్యేకంగా పేర్కొంటూ ఆయన్ని మంచి మిత్రుడుగా అభినందించాడు. బ్రౌన్ గౌరవించిన తెలుగు పండితుల్లో రావిపాటి గురుమూర్తిశాస్త్రి, పాటూరి రామశాస్త్రి, పురాణం హయగ్రీవశాస్త్రి మొదలయిన వారు ముఖ్యులు. ఈ పండితులకు బ్రౌన్ ఇల్లే ఒక కళాశాల.

శ్రీ శ్రీ అన్నట్టు కవిత్రయం అంటే తిక్కన, వేమన, గురజాడ మాత్రమే. అందునా వేమన పద్యాలను పండితుల దృష్టికి తెచ్చి వేమనను పాశ్చాత్య పండితులకు పరిచయం చేసిన ఖ్యాతి బ్రౌనుకే దక్కుతుంది.

'The verses of vemana' అనే పేరుతో ఇంగ్లిషులో వేమన పద్యాలను 1829లో అచ్చు వేయించాడు. ఉదాహరణకు-

'ఆత్మశుద్ధి లేని ఆచారమదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ'

అనే వేమన పద్యాన్ని.

'Observances void of Purity of heart to what end are they, To what end is the preparation of food without cleaning the vessel. Void of purity of mind, to what end is the worship of God.'

ఈ అనువాదములో భావాను వాదానికే ప్రాధాన్యం కన్పిస్తుంది. మక్కికి మక్కి తెలుగు పదాలను ఇంగ్లిషులో చేయలేదు.

ఈ వ్యాఖ్యల వల్ల హిందువుల భావాలు, మతసబంధమైన విషయాలు సంప్రదాయం స్పష్టంగా తెలుస్తుంది. అందు వల్ల మన సంస్కృతి, సంప్రదాయం వేమనద్వారా పాశ్చాత్యులకు అందించిన ఖ్యాతి బ్రౌనుకు దక్కుతుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. వేమన ఏ ప్రాంతానికి చెందిన వాడనే వాదోపవాదాలను సయితం వేమన వాడిన మాండలికాలను బట్టి ప్రాంత నిర్ణయం చేశాడు. దీనివల్ల బ్రౌను దొర తెలుగు దేశంలో ఉన్న భాషా మాండలిక భేదాలను సయితం క్షుణ్ణంగా పరిశీలించినట్టు బోధపడుతుంది.

భారతీయ మతసంస్కృతికి జీవగఱ్ఱలైన భారత, భాగవత రామాయణాలు చీకి శిథిలమై మారుమూలపడి మ్రగ్గుతున్న వాటికి జీవం పోశాడు. కేవలం ఏదో ఒక ప్రతి దొరికిందని దానికి సిద్ధప్రతి చేయలేదు. దేశం నలుమూలలా ఉన్న గ్రంథాలను తెప్పించి, వాటికి సరియైన పాఠ నిర్ణయం చేసి పండితులతో చర్చించి అప్పుడు సిద్ధప్రతి తయారుచేసి ముద్రించాడు. పెద్దపెద్ద సంస్థలు చేయలేని పని తానొక్కడు తన స్వంత ఖర్చుతో చేసిన పండిత పోషకుడు బ్రౌనుదొర

తెలుగు ప్రబంధాలయిన వసు చరిత్ర, మను చరిత్రలకు జూలూరి అప్పయ్య పండితునిచే వ్యాఖ్యానం వ్రాయించి ముద్రించాడు. వసుచరిత్ర 184: లో ముద్రిస్తే మనుచరిత్ర 1851 లో ముద్రించాడు. ఈ ప్రబంధాల వ్యాఖ్యానం విషయంలో ముఖ్యంగా గమనించవలసినది వ్యావహారిక భాషను ఉపయోగించడం. ప్రజల జీవద్భాష అయిన వ్యావహారిక భాషకు అనాడే బ్రౌనుదొర పట్టం కట్టడం విశేషం. ప్రజల భాష నిత్య వ్యవహారం ఎలా సాగుతుందో నని తీరిక దొరికినప్పుడల్లా నాలుగు వీధుల్లో జనం గుమిగూడి మాట్లాడే మాటలు, కోతలు కోసేవేళల్లో, నాట్లు వేసేరోజుల్లో కువ్వలు

నూర్చినాడు వాళ్ళ పలుకుబళ్లు ఎలా ఉంటాయో క్షుణ్ణంగా పరి లించేవాడు. సామాన్య మానవుల పలుకుబడుల్లోను, వీధి వ్య హారాల్లోను పల్లె ప్రజల పనిపాటల్లోను ఉండే పదాలు, జాతీయాలు సామెతలు, నిత్యవ్యవహారంలో సాగే సరసోక్తులను ఏర్చికూర్చి పేర్చి పరిశోధన గావించాడు.

పోతన భాగవతాన్ని కూడ పరిష్కరించి 1872లో శుద్ధ ప్రతి తయారుచేసి 1848 లో అచ్చు వేయించాడు. పింగళి సూరన కళా పూర్ణోదయాన్ని కూడ వ్యాఖ్యాన సహితంగా వ్రాయించి వెలయిం చాడు. పంచతంత్రాన్ని పరిష్కరించి 1827లో శుద్ధప్రతి తయారు చేశాడు. పంచతంత్రానికి ఆరు లిఖిత ప్రతులు లభించగా ముగ్గురు పండితుల చేత వాటికి టీకా వ్యాఖ్యానం వ్రాయించి పుస్తకం చివరన మాటల పట్టికను (Index) తయారు చేశాడు. ప్రపంచ నీతికథా సాహిత్యానికి మూలమైన పంచతంత్రం ప్రపంచ ప్రజలకు బ్రౌను తెలియ జేశాడనడంలో సందేహం లేదు.

తెలుగువారి సామాజిక జీవితాన్ని చిత్రించే పలనాటి వీర చరిత్ర అనే ద్విపద కావ్యాన్ని, తారాశశాంక విజయము, విజయ విలాసము, వైజయంతీ విలాసము,నలద్విపద మొదలైన కావ్యాలను పరిష్కరించి అచ్చు వేయించాడు, వ్యాకరణ విషయికంగా పరిశీ లిస్తే తెలుగు సంస్కృతి జన్యమని డాక్టర్ విలియం కేరీ వాదిస్తే దానిని కాదని నిరూపించినవాడు ఎ. డి. కాంబెల్. బిషప్ కాల్డ్వెల్ రచించిన 'Dravidian Comparative Grammar' లో ద్రావిడ భాషల సాజాత్య నిరూపణం గావించి తెలుగు మూల ద్రావిడ భాషా గతమని పేర్కొన్నాడు. ఈ యిద్దరి వాదనను సమన్వయం చేసి బ్రౌను తన తెలుగు వ్యాకరణంలో తమిళ, కన్నడ, తెలుగు, మలయాళ తదితర ద్రావిడ భాషలకు మూలం మూలద్రావిడ

భాషేనని నిర్ధారిస్తూ ఉదాహరణలు చూపాడు. తెలుగు ధాతువులకు. సంస్కృత ధాతువులకు ఏ విధమైన పోలిక లేదని నిరూపించాడు.

ఛందస్సును గూర్చి చర్చించే సందర్భంలో తెలుగు ఛందస్సుకు ఉన్న సమస్తమైన విషయాలు లాటిన్. గ్రీకు భాషల ఛందస్సులతో పోల్చిచూపి తనపాండిత్యాన్ని ప్రదర్శించుకొన్నాడు. ఇందువల్ల లాటిన్. గ్రీకు భాష తెలిసిన పండితులకు తెలుగు ఛందస్సును సులభంగా నేర్చుకునే అవకాశం కల్పించిన ఖ్యాతి బ్రౌనుకు దక్కుతుంది. అదే విధంగా లాటిన్. గ్రీకు భాషల ఛందో పరిజ్ఞానం మనకు ఏర్పడుతుంది. యతి ప్రాసలను గూర్చి చర్చిస్తూ ప్రాచీనాంగ్ల కవుల రచనల్లో కూడ శబ్ద సౌందర్యం కోసం యతి ప్రాసలు వాడతారని ఉదాహరణ పూర్వకంగ తెలియ జేశాడు. స్పానిష్ భాషలో యతి, గోథిక్ భాషలో ప్రాస ఉందని పేర్కొన్నాడు. ఉభయ తారకంగా ఉండే ఈ పరిశీలన భావి పరిశోధకులకు ఎంతో ఉపకరిస్తుంది.

బ్రౌను అనంతరం ఆర్డెన్ తన తెలుగు వ్యాకరణ పీఠికలో తెలుగు చదువుకునే ప్రతి విద్యార్థి బ్రౌనుకు ప్రత్యేకంగ కృతజ్ఞుడై ఉండాలని పేర్కొన్నాడు.

బ్రౌను కీర్తిని అజరామరం చేసింది. అశేషమైన అఖండమైన కీర్తిని పేరు ప్రతిష్ఠలు తెచ్చినవి ఆయన నిఘంటువులు. నిఘంటు నిర్మాణానికి బ్రౌను పూనుకోవడానికి ఓ చిన్న కథ లభ్యమవుతుంది. బ్రౌను 1826లో భారతం చదువుతున్నప్పుడు కష్టమైన పదానికి పండితులను అర్థం అడిగేవాడట. ఆ అర్థం జాగ్రత్తగా రాసుకునేవాడు. మరలా అదేపదం మరోచోట వచ్చినప్పుడు మరో అర్థం పండితులు చెప్పేవారట. తొలి అర్థానికి తుది

అర్థానికి భేదం ఏమిటని నిగ్గదీసి అడిగితే అది అంతే అని పండితులు చెప్పేవారట. బ్రౌను నిఘంటు రచనకు అది ప్రేరణ అని పెద్దలు అంటారు. అందుకని 18 3 నాటికి ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు తయారుచేసి ముద్రించాడు. బ్రౌను తెలుగు నేర్చుకునే కోవలో తెలుగు-ఇంగ్లీషు పదాలు తన ఉపయోగార్థం సేకరించిన వాటిని మరికొన్ని పదాలతో సంపూర్ణంగా సేకరించి 1852 లో ముద్రించాడు. తెలుగులో పొల్లుహల్లులు ఉచ్చరింపబడని వాటిని అజంతాలుగా మార్చి తెలుగును ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్‌గా పేర్కొని విశ్వవిఖ్యాతిని చేకూర్చిన వాడు బ్రౌను. భాషా విషయికమైన మార్పును కూడ కొన్ని పేర్కొనవచ్చు. తెలుగు సాహిత్యంలో ఉండే అర్ధాను స్వారాలు. నకారాంతాలు శకటరేఫలు మున్నగు వాటిని అనావశ్యకాలని పరిహరించాడు. దీనివల్ల ఆనాటి వ్యావహారిక భాషాప్రయోగం నేటి వ్యావహారిక భాషాభిమానులకు బలం చేకూరినట్లయింది. భాషా సంస్కరణల్లో కామాలు. సెమికోలన్‌లు.ప్రశ్నార్థకాలు.ఆశ్చర్యార్థకాలు మొదలయిన పంక్చ్యుయేషన్ చిహ్నాలు తెలుగు సాహిత్యంలో బ్రౌను తర్వాతనే వచ్చాయంటే చాల మందికి ఆశ్చర్యం కలుగుతుంది.

బ్రౌను భారతదేశంలో కేవలం ప్రభుత్వోద్యోగిగా వచ్చినా జన్మతః క్రైస్తవుడు కాబట్టి బైబిలు భాగాలు మొదట అనువదించి చివరికి బైబిలు మొత్తం తెలిగించాడట. విచిత్రం ఏమిటంటే బ్రౌను ముద్రించిన అనువాదం యథాతథంగా యితరులు తమ స్వంత అనువాదాలుగా ముద్రించుకొని చెలామణి చేసుకున్నా బ్రౌను క్షమించి ఊరుకున్నాడట. ఇది బ్రౌను విశాల హృదయానికి నిదర్శనం. బ్రౌను తెనిగించిన బైబిలు పూర్తి ప్రతి నేటికీ లండన్‌లోని బైబిల్ హౌస్‌లో ఉంది.

కేవలం గ్రంథాలే కాక హిందువుల ఆచార వ్యవహారాలు. ఆనాటి విద్యావిధానం మీద ప్రముఖ గ్రంథాల మీద వ్యాసాలు ఆంగ్లంలో రచించాడు. ప్రజల సౌకర్యాన్ని గుర్తించి పంచాంగం తయారుచేసి 1850 లో ముద్రించాడు.

దాదాపు 34 గ్రంథాలను తెలుగు, ఇంగ్లీషు, సంస్కృత భాషలలోని గ్రంథాలను వెలయించి తెలుగు సాహిత్యం ఈనాటికి సజీవంగా ఉండేందుకు సహాయ్యం చేసిన బ్రౌనుదొర 1884 డిసెంబర్ 12న తన ఎనభై ఏడవయేట అస్తమించాడు. బ్రౌను శారీరకంగా గతించి నూరేళ్లు అయింది. కాని తెలుగుభాష తెలుగు జాతి, తెలుగు సాహిత్యం ఉన్నంత కాలం బ్రౌను దొర జీవించే ఉంటాడు. బ్రౌను మనకందించిన సాహిత్యాక్షరాలు సజీవాక్షరాలుగా చిరకాలం చిరంజీవులుగా ఉంటాయి.

ఆకాశవాణి, విజయవాడ.
21-9-1984

ఆధర గ్రంథ సూచిక


బంగోరె : బ్రౌన్ లేఖలు

మోహన్ : కె. ఆర్. కె,
పాశ్చాత్య విద్వాంసులు తెలుగు భాషా సంస్కృతులు.

విజ్ఞాన సర్వస్వము : సం: 3, 4.

వీరభద్రరావు, కొత్తపల్లి : సి. పి. బ్రౌను.

" " : తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము.

# ఈ దశాబ్దపు తెలుగు కథానికలో సామాజిక స్పృహ

ఒక మంచి వంటకం కావాలంటే వస్తువనే ముడిపదార్థం చాల అవసరం. అలాగే ఓ కథ కావాలంటే దానికీ వస్తువే కావాలి. ఈ వస్తువెలాంటిదనేది రచయితపై ఆధారపడి ఉంటుంది. రచయిత శిల్పి అయితే వస్తువు బండరాయి. మలిచేవాని ప్రతిభపై ఆ నిర్మాణం ఆధారపడి ఉంటుంది. కథానికకూడ అంతే.

కథానికను ఆలంకారికులు గద్య ప్రక్రియగా పేర్కొంటారు. దానికి అగ్నిపురాణంలో ఉదాహరణంగా

"ఆఖ్యాయికా. కథా, ఖండకథా, పరికథాతథా
కథానికేతి మన్యంతే గద్యకావ్యంచ పంచధా"

అని గద్య కావ్య భేదాలను ఆఖ్యాయిక, కథ, ఖండకథ, పరికథ, కథానిక అని ఐదు విభాగాలుగా పేర్కొన్నారు. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో కథాసాహిత్యానికి ఉదాహరణంగా కేతన దశకుమార చరిత్ర గద్య-పద్యాత్మకమైన అద్భుత రసోపేత కథా మంజూషికగా పేర్కొవచ్చు. అలాగే అనంతామాత్యుని భోజరాజీయము, జక్కన విక్రమార్క చరిత్ర. వెన్నెలకంటి అన్నయ్య, షోడశకుమార చరిత్ర, కొరవి గోపరాజు సాలభంజికల కథలు, కదిరిపతి శుకసప్తతి నారాయణ కవి హంస వింశతి, తురగా వెంకటరాజు రామ చరిత్ర లందు విశేష ప్రాచుర్యం వహించిన కథలు కన్పిస్తాయి.

సాహిత్యంలో మతంకాని, భయంకాని ప్రాధాన్యత వహించి నట్లయితే వాస్తవికతకు అవకాశం తక్కువగా ఉంటుంది. సృజన

సాహిత్యంలో వాస్తవికత. సామాజిక చైతన్యానికి ప్రతీక. ఆర్థిక స్థితితో వెనుకబడ్డ వాళ్ళు మధ్య తరగతి జనం ఉత్పత్తి సంస్థలలో కూలీలు. శ్రామికులు. పీడిత వర్గాలు. ఆర్థిక సామాజిక రాజకీయ సమానతలు కోరుకొనేవారు సాహిత్యంలో వాస్తవం పేర చోటుచేసుకున్నారు. ఎక్కడైతే వాస్తవం చోటు చేసుకుంటుందో అక్కడ సామాజిక స్పృహ వుందని భావించవచ్చు. కథానికను చిన్న కథ అని అనడంకూడ ఆంగ్ల భాషాప్రభావమనే చెప్పాలి. Short story ని తెలుగులో కథానిక. చిన్నకథ అని మనం పిలుస్తున్నాం. అందువల్ల ఇది ఆంగ్ల సాహిత్య సంపర్కం వల్ల వచ్చిందని నిర్ధారించవచ్చు.

19వ శతాబ్ది తరువాత ఆంగ్ల సారస్వత ప్రభావం వల్ల. క్రైస్తవ మిషనరీలు ప్రవేశపెట్టిన విద్యావిధానం వల్ల విమర్శనా దృష్టి అలవడింది. ఎప్పుడైతే 'రియలిజానికి'సాంస్కృతిక రంగంలో స్థానం యేర్పడిందో ఆనాటి నుంచే వాస్తవికతా దృక్పథం ఆవిర్భవించింది. వాస్తవికత ఎక్కడుందో అక్కడ సామాజిక స్పృహ అగ్రస్థాన మాక్రమిస్తుంది. సామాజిక స్పృహ అంటే స్థూలంగా జీవితాన్ని. సమాజాన్ని ఉన్నది ఉన్నట్లుగా చిత్రీకరించడం అని చెప్పవచ్చు.

ఈ సామాజిక స్పృహ అనేది కవితా చమత్కృతి చేసే పద్య రచనల్లో కన్నా గద్య ప్రక్రియలోనే అధికంగా కన్పిస్తుంది. గద్య ప్రక్రియ అయిన నవల. నాటకం. విమర్శనల కన్న కథా సాహిత్యంలో రచయిత సమాజం యిలా ఉంది. యిలా ఉండాలి అని బాహాటంగా పేర్కొంటాడు. సామాజిక సత్యంలో కల్పనలకు తావులేకుండా వుండాలని కోరుకోవడంలో రచయిత తప్పేమీ లేదు.

ఆధునిక కథా సాహిత్యంలో సామాజిక స్పృహ అంతర్వా హినిగా ప్రవహిస్తుంది. కనుకనే సాహిత్యం సమాజానికి దర్పణం వంటిదని ప్రాజ్ఞులు పేర్కొంటారు.

ఆధునిక యుగంలో ముని మాణిక్యం నరసింహారావు గారి కథలు గృహస్థ జీవితానికి సంబంధించినవి. వాటిల్లో 'కాంతం' - పాత్ర చిత్రణ పాఠకుల హృదయంలో చెరగనిముద్ర. మొక్కపాటి నరసింహశాస్త్రిగారి రచనల్లో హాస్యం ప్రధానం. శ్రీనివాస శిరోమణి గారి కథలు సాంఘికాలు. ధర్మ స్థాపనం, భార్యా రూపవతి వంటి కథలు సుదీర్ఘాలే యైనా ఆలోచనాత్మక రీతిని నడిపించేవిగా ఉంటాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల్లో జమిందార్ల జీవితం - సంఘసంస్కరణ మొదలైనవి కథావస్తువులుగా స్వీకరించి భాషలో శుద్ధ శ్రోత్రియ కుటుంబాలలో నడచే పరిభాషకు అగ్రతాంబూల మిచ్చారు. విషభుజంగము, గులాబీ అత్తరు, అడబడచు వంటి వీరి కథలు ప్రసిద్ధాలు.

తరువాత అడవి బాపిరాజుగారి కథలు ప్రధాన పాత్రలలో శిల్పులను - చిత్రకారులను తీసికొని సత్య వ్యాప్తికాలైన రెండు జగత్తుల సమ్మేళనంతో చిత్రీకరించారు. భగీరథలోయ, హిమాలయ రశ్మి, తిరుపతికొండ మెట్లు, నాగలివంటి కథలు, వారి రచనా శేముషికి ప్రతీకలు. గుడిపాటి వెంకటాచలంగారి కథావస్తువులలో విశేషంగా స్త్రీపుంస జాత్య సంబంధిగా కన్పిస్తాయి. విశిష్ట రూపంతో పాత్ర చిత్రణ దిగంబరమైన మానసికస్థితి పరిశీలన అసాధారణ కథా నిర్వహణా సామర్థ్యం కలవిగా కన్పిస్తాయి, వేదాంతం,హంపి కన్యలు మంచి ఉదాహృతులు.

భమిడిపాటి కామేశ్వరరావుగారు ఆలోచనాత్మక శైలిగలిగి హాస్యకథలు రచిస్తే, కథలు అతి తక్కువగా వ్రాసిన విశ్వనాధ సత్యనారాయణ "మాక్లీదుర్గంలో కుక్క". నోరి నరసింహశాస్త్రి చిలుక వీరుడు యీ కథల జాబితాలోనికే వస్తాయి.

ఇంకా మల్లాది, గోపీచంద్, కృష్ణశాస్త్రి, బుచ్చిబాబు, గొల్లపూడి, శీలావీర్రాజు, మంజుశ్రీ, తాళ్ళూరి నాగేశ్వరరావు ప్రభృతుల కథానిక లెన్నో ఉన్నాయి.

స్త్రీ రచయితలలో ఆనందరామం, నాయనీ కృష్ణకుమారి, మాలతీ చందూర్, సులోచనారాణి, రంగనాయకమ్మ, రామలక్ష్మి, [redacted] లత, భానుమతీ రామకృష్ణ ప్రభృతులు నవలా సాహిత్యానికి నాంది పలుకక పూర్వం కథా సాహిత్యాన్ని, సామాజిక జీవనాన్ని స్పృశించినవారే.

ఇటీవల కథలలో ప్రేమకథలు అత్యధికంగా ప్రజాదరణ చూరగొంటున్నాయనడంలో సందేహమేమాత్రం లేదు. ప్రేయసీ ప్రియుల ప్రణయం పవిత్రమైనదిగా భావబంధురమైనదిగా చిత్రీకరిస్తూ రచించిన కథానికలు అత్యధికం, తమ్మినేని అక్కిరాజు రచించిన 'ఆచరణ' కథలో మాటలకన్నా చేతల్లో గొప్పదనాన్ని మంచిని చూపిన శేషగిరి పాత్రద్వారా మంచితనానికి పట్టం కట్టడం విశేషంగా చెప్పవచ్చు ప్రతి పురుషుడు మోసగాడని వేలెత్తి చూపే సీత పాత్రద్వారా పాఠకులకు కొంత కనువిప్పు కలిగించడం విశేషం.

రాగశ్రీ రచించిన "అమలిన శృంగారం" అనే కథలో ప్రేమంటే కేవలం శారీరక భోగం కాదని వావివరసల వల్ల కలిగే లోపభూయిష్టమైన బాంధవ్యాలవల్ల సంతానం ఎలా నిర్వీర్యం

అవుతుందనే విషయాన్ని నిరూపించడం ఒకవైపు. మరొకవైపు ప్రేమను అందలం ఎక్కించి రచయిత కృతకృత్యులైనారనే చెప్ప వచ్చు.

శంకరమంచి సత్యం "ఆరేసిన చీర"లో చెరువు గట్టున బట్ట లుతికితే చాకళ్ళసహజమైనవ్యావహారికభాష కన్పిస్తుంది. భాషాపరంగా ఒక ప్రత్యేకతను చూపిస్తే, లచ్చి-సాంబడు ప్రేమ కలగలిపి ఉతికి ఆరేసినట్లుండేది. అయితే వారి ప్రేమైక భావనలోయెవరో ఉతకడాని కిచ్చిన చీర కట్టుకున్నందువల్ల భార్య అందంగా, అప్సరసలా కన్పిం చిందని హృదయానికి హత్తుకొని ఆరేసిన చీరచాటుకు వెళ్ళిపోతారు.

త్రిపుర చీకటి గదులలో భాస్కరం కళ్యాణి, శేషు పాత్రలు ప్రత్యేకంగా పేర్కొనాలి. ఇది మానసిక విశ్లేషణ చేసిన కథానిక. ఎదతలుపులు తెరచుకొని ప్రేమసౌరభాన్ని హృదయం నిండా నింపుకొని అనురక్తంగా ఉన్నపుడు వేరొకరి భావనలవల్ల ఎలా ప్రభావిత మౌతుందో సైకలాజికల్‌గా జరిగిన సంఘర్షణ వివరించ బడింది.

సూర్య రచించిన "శ్రీమతికి ప్రేమలేఖ"లో సినిమాలపై యువకుల ప్రభావాన్ని చిత్రీకరిస్తూ భార్యకు ప్రేమలేఖ ఎలా రాయాలో తెలియక యితర పుస్తకాల్లో సంగ్రహించిన విషయాలు రాసి పోస్టు చేసిన అనంతరం తిరుగు టపాలో 'మీ ధోరణి చూస్తే నాకేదో భయంగా ఉంది. రాత్రిళ్ళు ఎక్కువగా మేల్కొన కండి" అని అమ్మవారి కుంకుమ, బాబాగారి విభూతి, తాయెత్తులు చూసి హతాశుడవుతాడు.

కుటుంబ గాథలను ఇతి వృత్తంగా స్వీకరించి కథానికలుగా రచించిన వారిలో సింహ ప్రసాద్ "టూలేట్" అనే కథలో ఆర్థిక

సమస్యను ముఖ్యంగా తీసికొని మరణావస్థలో ఉన్న తండ్రిని చూడాలన్న ఆతృత ఒక వైపు, అవసరానికొక్క పైసా లేక మనసులో జరిగే సంఘర్షణ ఒక మలుపుగా చిత్రీకరించాడు రచయిత.

త్రిపుర "సుబ్బారాయుని సగటు జీవనం"లో ఆశకు గల లక్ష్యాన్ని. సగటు మానవుని జీవనంలో గల ఫాంట సీని చక్కగా నిరూపించారు. సదానంద కొత్తమలుపులో హనుమంత అనే యువకుని తిరుగుబోతుగా, జులాయిగా చిత్రీకరించడం. కూలి డబ్బులతో గంజికాసి తండ్రిని పోషించే ఒక స్త్రీ సమాజంలో కొడుకు కన్నా మిన్నయని చెప్పడం స్త్రీలోకానికే గర్వకారణం.

నందం రామారావు నడుస్తున్న చరిత్రలో పేకాటకు బానిసైన భర్త భార్యను ఒంటరిగా సినిమాకు పంపడం, ఆమె సినిమానుండి తిరిగొచ్చే వేళ పోలీసులు పట్టి వేశ్యగా చిత్రీకరించి కోర్టుకీడ్వడం వలన ఆమెలో జరిగే మానసిక సంఘర్షణ యిందు చిత్రీకరించ బడింది. స్త్రీలకు మానప్రాణ రక్షణకు యీ దేశంలో స్థానం లేదని నిరూపించిన చక్కని కథ.

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు "పొద్దు గడవదు" కథలో మారుమూల గ్రామంలో ప్రభుత్వోద్యోగి ప్రొద్దుగడవక యెలా బాధపడతాడో, పల్లె ప్రజలతో యిమడలేక పోవడం చక్కగా కన్పిస్తుంది.

అరుంధతీరావు రచించిన "ఇదీ న్యాయమేగా" అనే కథలో మనిషిని మనిషి సమ్మతేని రోజుల్లో దారితప్పి వచ్చిన పన్నెండేళ్ళ పాప కాశ్రయ మిచ్చి తిరిగి ఆమె యింటికి చేర్చడం యిందులో ఇతివృత్తం.

రామచంద్రమౌళి "కూలీలక్ష్మి"లో మార్క్సిజం ప్రభావం కొంత కన్పిస్తుంది. ప్రభువెక్కిన పల్లకి కాదని మోసే కూలీలనే యిక్కడ ప్రధాన వస్తువుగా స్వీకరించాలని రచయిత ఉద్దేశ్యం.

శ్రీరామలక్ష్మి "కట్నం తీసికోని సుబ్బారావు"లో కట్నానికమ్ముడుపోయి గంగిరెద్దులా తిరిగేవాడికన్న కష్టపడి ఉద్యోగం చేసుకొని తృప్తిపడే వ్యక్తి మిన్న అని సుబ్బారావు పాత్ర ద్వారా నిరూపించడం కనిపిస్తుంది.

ఇటీవలే వచ్చిన లలితాదేవి "మగమహారాజు" కథలో దయ తలచి ఆదరించిన పక్కింటి యిల్లాలి మంచితనాన్ని తన అవసరానికి వాడుకొందామని యత్నించిన ఒక దుర్మార్గునికి తగిన గుణపాఠం చెప్పడం చక్కని మలుపు.

కొలకలూరి 'ఇనాక్' గంగాస్నానం కథానికలో ఎంతో ఆశగా గంగాస్నానానికై వెళ్ళిన భక్తునికి అక్కడి మురికి వాతావరణం, శవాలు గంగలో కొట్టుకురావడం, ఆ నీళ్ళలోనే కుష్ఠురోగుల స్నానం, చర్మవ్యాధుల వాళ్ళు జలకాలాడటం చూసిన భక్తునికి ఈ జన్మకు గంగలో దిగకూడదని తిరిగొస్తాడు. ఇదేకోవలో 'పిండీకృతశాటి'. 'ఊ[illegible]లేనోడు' మొదలగు కథానికలు ఉదాహరించవచ్చు.

హాస్యం మానవ జీవితంలో ముఖ్యమయింది. "నీవు నవ్వితే ప్రపంచం నీతో నవ్వుతుంది. ఏడిస్తే మాత్రం నువ్వొక్కడివే"- అన్న ఓర్బల్ వాక్కు హాస్య ప్రాధాన్యతను తెలుపుతుంది.

తుమ్మల సంజీవరావు 'మంచం' లో కథానాయకుడైన సుబ్బారావుకి ప్రియమైంది మంచం. తీరిక దొరికినప్పుడు దాన్ని శుభ్రం చేయడం బద్ధకం వస్తే శయనించడం అతని లక్షణం.

కొంచెం పెద్దదైన కుమార్తె తండ్రిలా మంచం శుభ్రం చేస్తే తండ్రి చూసి మెచ్చుకొంటాడు. అందుకు కోపం వచ్చిన మగ పిల్లలు విరగ్గొడతారు. మంచం మంచి షెల్ఫ్ చేయించుకోండనే భార్య సలహాతో ముగుస్తుంది. సునిసిత హాస్య సంభాషణా చాతుర్యం యిందు కన్పిస్తుంది.

మొక్కపాటి నరసింహశాస్త్రి హాస్యకథలు రచించడంలో అందె వేసిన చేయి. ఈ మధ్య పునర్ముద్రణ పొందిన "ధనార్జనకు దగ్గరిమార్గం"లో విజ్ఞానం ధనంగాగల వ్యక్తులు తమ వాక్చాతుర్యంతో భూస్వాములను లక్షాధికారులను, వ్యాపారస్తులను ఆనంద పరచి వారిని సన్మార్గ ప్రవర్తకులుగా తీర్చిదిద్దడం కనిపిస్తుంది. సాహిత్యంలో సమాజం ప్రతిబింబింగాలన్న విషయాన్ని ఈ కథలో చమత్కార గర్భితంగా చెప్పారు.

శ్రీమతి ప్రోలా ప్రెగడ రాజ్యలక్ష్మి "పాపం....మగవాళ్ళు" లో పురుషుడు తన మనుగడపై వివిధ దశలలో యెలా ఆధారపడి ఉంటాడో వివరించింది. "కార్యేషుదాసి కరణేషు మంత్రి" అన్న శ్లోకాన్ని తలపింప జేస్తుంది.

నీతి న్యాయం సమాజంలో అందరికి అందుబాటులో ఉండాలని స్త్రీకి, పురుషునికి వేరు వేరు నీతులుండరాదనే కథలు అసంఖ్యాకాలు.

వ్యభిచరించిన స్త్రీని, వెలివేయాలనే సమాజంలో అందుకు కారణమైన పురుషునికి యే శిక్ష వేస్తారని ప్రశ్నించి నిలవేసే నీతి శ్రీమతి జ్యోతి వ్రాసిన కథలో ప్రశ్నించటం సముచితంగా ఉంది.

సీల కొట్టినప్పుడు విజృంభించిన 'రుద్ర' విప్లవ నాయిక.

దాంషా "మత్తానయ్య మరణం"లో శాంతి కాముకత్వం. కార్యసఫలత కలిగిస్తుందని. విప్లవప్లవంగాలు. వీర విహారం చేసి నప్పుడే సర్వం పర్వంగా ఉంటుందని 'శ్రీనివాసరావు' పాత్ర ద్వారా నిరూపించాడు.

ఉప్పల లక్ష్మణరావు రచించిన గెరిల్లా లో ధైర్యానికి కొలబద్ధ చావడం కాదని. జీవించే లక్ష్యంతో జీవింప జేయడం మహనీయుల లక్ష్యమని సిద్ధాంతాల విలువల్లో. రాద్ధాంతాలెన్ని వచ్చినా కార్యసిద్ధి నందడం ముఖ్యమని స్త్రీ పాత్ర ద్వారా వివరించారు.

స్నేహానంద్ 'చింతపండు' కథలో అమాయకుల శ్రమను దోచుచునే షావుకారుకు పాఠం నేర్పే వనితగా 'పోరమ్మ' చిత్రీకరణ బావుంది.

మొట్టమొదటగా పేర్కొననూ తుట్టతుదిగా ఉట్టకించినా గురజాడ వారి దిద్దుబాటు కథానికను చెప్పుకోవాలి. ఇందులో అర్థ రాత్రిదాకా అడ్డమైన తిరుగుళ్ళు తిరిగి ఇంటికి అలస్యంగా వచ్చిన మగమహారాజుకు పెళ్ళాం కనబడక పోయేటప్పటికి కంగారై. బేజారెత్తి ఏమయిపోయిందనుకునే లోగా సేవకుడామె పుట్టింటికి వెళ్ళిందని చెప్తాడు. దాంతో పశ్చాత్తాపం కలిగి భార్య యొద్దకు రాయబారం పంపే ప్రయత్నాల్లో అందుకు నాటకమాడిన యిల్లాలు మంచం కిందనుంచి నవ్వుకుంటూ వొస్తుంది. అదే అతనిలో వచ్చిన దిద్దుబాటు. ఆపై వచ్చిన కథ "మనుషులు చేసిన దేవుళ్ళారా మీ పేరేమిటి? అన్నది." అన్నది. ఇది 1910లో ప్రచురించబడింది.

"ఈ దేశంలో పాండవులుండని గుహలు, సీతమ్మ స్నానం చేయని గుంటలుండవని" హేళన చేసారు. వెంకయ్య అనే పాత్ర ద్వారా "ఆపీసుగుల్ని అందరూ కలిసి పూజ తగలెట్టాదు." అనే పదునైన శైలిలో, సునిత హాస్యంలో సమాజాన్ని సంస్కరించారు.

ఈ సందర్భంలో అతిముఖ్యమయిన విషయం పేర్కొనాలి. ప్రపంచ కథానికల పోటీలో పాలగుమ్మి పద్మరాజుగారి గాలివానకు బహుమతి రావడం తెలుగు వాళ్ళందరూ గర్వించదగిన విషయం. పురాణం వారి మాటల్లో చెప్పాలంటే తెలుగు కథకులెవర్నీ పాల గుమ్మి పద్మరాజు గారితో పోల్చడానికి వీలులేదు, ఇతరులెవరూ ఆయనలా వ్రాయలేరు. ఆయనతో కూర్చోలేరు.వీరి పడవ ప్రయాణం, వాసనలేని పూలు, ఎదురు చూస్తున్న ముహూర్తం మొదలయినవి ముఖ్యంగా పేర్కొనవచ్చు.

సంస్కర్తలనే సంస్కరించే కథకు సంస్కర్త హృదయం కావాలి. వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకొని సామాన్య జన జీవితానికి దగ్గరగా ఉండే విధంగా హృదయాన్ని స్పందింప చేసే సాహిత్యం నేడవసరం. ఈనాటి తెలుగు కథలలో అడుగడుగునా సామాజిక స్పృహ కన్పిస్తూనే ఉంది. సామాజిక స్పృహ లేని కథలు మనకు లేవని నిస్సందేహంగా చెప్పవచ్చు.



## ఆధార గ్రంథ సూచిక


తెలుగు కథారచయితలు : పరిశీలనాత్మక వ్యాస సంకలనము, అకాడమి ప్రచురణ.

మహతి : వ్యాస సంపుటి, యువభారతి ప్రచురణ.

నరసింహం, కె. వి. ఆర్ : సాహిత్య దర్శనము ఇంకా ఆంధ్ర జ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, ఆంధ్రభూమి మొదలగు వారపత్రికలు. స్వాతి, జ్యోతి, ఆంధ్రభూమి, భారతి మొదలగు మాసపత్రికలు. వాణి పక్షపత్రిక. ఇంకాఎన్నో.

రంగనాధాచార్యులు, కె. కె. (సంపా) : తెలుగు సాహిత్య వికాసం.

విజ్ఞాన సర్వస్వము సంపుటి : 4


ఆకాశవాణి, విజయవాడ

17-8-1984

# సమానార్థక పదనిఘంటువు - విలియం కేరీ అముద్రిత గ్రంథం

భారతదేశంలో క్రైస్తవమత ప్రచారం గావించేటందుకు విదేశీమిషనరీలు స్థానిక భాషలు అభ్యసించారు. పాశ్చాత్యులు భారతదేశాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో ఉద్యోగుల్లో ఎక్కువభాగం పాశ్చాత్యులేగనక వారి సౌకర్యార్థం, క్రైస్తవమత ప్రచారకుల కోసం స్థానిక భాషల్లో వ్యాకరణాలూ, నిఘంటువులూ ముద్రించవలసిన అవసరం ఏర్పడింది. పాశ్చాత్యుల్లో :

1) విలియం బ్రౌన్ : ఎ వొకాబులరీ ఆఫ్ జంటూ అండ్ ఇంగ్లిష్ (A Vocabulary of Gentoo and English) మద్రాసు. 1818.

2) కాంబెల్, ఎ. డి. : ఎ డిక్షనరీ ఆఫ్ తెలుగూ లాంగ్వేజీ (A Dictionary of Teloogo Language) మద్రాసు, 1821.

3) మోరిస్, జె. సి. : ఎ డిక్షనరీ ఇంగ్లిష్-తెలుగు (A Dictionary English-Telugu) మద్రాసు. 1835.

4) కార్పెంటర్, డబ్లియు : ఎ డిక్షనరీ ఆఫ్ఇంగ్లిష్ అండ్ తెలుగు (A Dictionary of English and Telugu) లండన్, 1835.

5) నికొలాస్, జె. : ఎ వొకేబులరీ ఆఫ్ ఇంగ్లిష్ అండ్ తెలుగు (A Vocabulary of English and Telugu) మద్రాసు, 1841.

6) బ్రౌన్, సి. పి. : 1) ఎ డిక్షనరీ, తెలుగు అండ్ ఇంగ్లీష్ (A dictionary of English and Telugu) మద్రాసు. 1852.

2) ఎ డిక్షనరీ, ఇంగ్లీష్ అండ్ తెలుగు (A Dictionary, English and Telugu) మద్రాసు. 1853.

7) పెర్సివల్ (రెవ్), పి. : తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరీ (Telugu-English Dictionary) మద్రాసు. 1862.

8) హాలర్, పి. : తెలుగు నిఘంటువు కంటైనింగ్ తెలుగు - ఇంగ్లీష్ అండ్ ఇంగ్లీష్-తెలుగు (Telugu Nighantuvu containing Telugu - English and English - Telugu dictionary) రాజమండ్రి. 1900.

ప్రభృతులు అకారాది క్రమంలో ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులు, వ్యాకరణాలు రచించారు. తెలుగు నిఘంటువులు రచించిన దేశీయుల్లో

1) రామకృష్ణ శాస్త్రులు, సి. : ఎ వొకేబులరీ యిన్ ఇంగ్లీష్ అండ్ తెలుగు (A Vocabulary in English and Telugu) మద్రాసు. 1841

2) వీరాస్వామి మొదలియార్ : ది బిల్డర్ వొకేబులరీ యిన్ ఇంగ్లీష్ అండ్ తెలుగు (A Builder Vocabulary in English and Telugu) మద్రాసు. 1841.

3) శంకరనారాయణ, పి. : ఎ స్మాలర్ ఇంగ్లీష్-తెలుగు డిక్షనరీ (A Smaller English - Telugu dictionary) మద్రాసు. 1804.

తెలుగు - ఇంగ్లీష్ డిక్షనరీ (Telugu - English dictionary) మద్రాసు - 1900.[1]

ప్రభృతులు ముఖ్యులు. తెలుగు - తెలుగు శబ్దకోశాలలో శబ్దరత్నాకరం, శబ్దార్థచంద్రిక, సూర్యారాయాంధ్ర నిఘంటువు, వావిళ్ళవారి నిఘంటువు, ఆంధ్ర వాచస్పత్యము లాంటివి చాల ప్రసిద్ధిపొందాయి.

తులనాత్మక పదపట్టికలనూ, భాషల సాజాత్యాన్నీ నిరూపించడానికి వివిధ భాషల్లోని పదాలను సేకరించి ఏదో ఒక భాషను మూలరూపంగా గ్రహించి ఇతర భాషల్లోని పదాల సాజాత్యాన్ని నిరూపించే గ్రంథమే బహుభాషా నిఘంటువు (Polyglot dictionary) లేక సమానార్థక పద నిఘంటువు అని అంటారు.

సూక్ష్మంగా వివరిస్తే అనేకభాషల్లో భాషాంతరంగల గ్రంథాన్ని సమానార్థక పద నిఘంటువు అని అనవచ్చు.

ప్రపంచంలో తొట్టతొలి సమానార్థక పద నిఘంటువు కార్డినల్ ఫ్రాన్సిస్కో (Cardinal Fransico) నిర్వాహకత్వాన 1522వ సంవత్సరం స్పెయిన్‌లో ఆరు సంపుటాలుగా ముద్రించబడింది. ఇది బైబిలుకు సంబంధించిన నిఘంటువు, పాతనిబంధన హిబ్రూ గ్రీకు భాషల్లోనూ, క్రొత్తనిబంధన గ్రీకు, లాటిన్ భాషల్లోనూ ప్రచురితమయింది.

పదమూడు భారతీయ భాషల సాజాత్యనిరూపణకుగాను సంస్కృతాన్ని మూలభాషగా గ్రహించి నిఘంటువును తయారు

1. Grierson, G. A. Linguistic Survey of India, Vol. IV, P-855, Delhi, 1967.

చేసినవాడు విలియంకేరీ (William Carrey). ఈ నిఘంటువుకు 'యూనివర్సల్ డిక్షనరీ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజస్' (Universl dictionary of Indian languages) అని నామకరణం చేశాడు. ఇది అముద్రిత గ్రంథం.

వియంకేరీ ఇంగ్లండులోని పాలెస్పరీ అనే గ్రామంలో ఎడ్మండ్ కేరీ. ఎలిజబెత్ దంపతులకు 1711 ఆగష్టు 17న జన్మించాడు. పాతిక సంవత్సరాలు నిండకముందే హిబ్రూ. గ్రీకు. లాటిన్. ఫ్రెంచ్. డచ్ భాషల్లో పాండిత్యం సంపాదించాడు. 1787 లో క్రైస్తవ మత గురువుగా పట్టాభిషిక్తుడయాడు. 1793 నవంబరు 11న కలకత్తాకు వచ్చి. కలకత్తాకు ఉత్తరంగా 30 మైళ్ళ దూరంలోని బండేల్ (Bandal) అనే పోర్చుగీసు స్థావరం అనుకూలంగా ఉంటుందని ఎంచుకున్నాడు. అక్కడ డాక్టర్. థామస్ (Dr. Thomas) అనే బెంగాలీ ఉపాధ్యాయునితోనూ. రాంబస్ (Rambus) అనే అనువాదకునితోనూ పరిచయం అయింది. అయితే ఆర్థికమైన ఇబ్బందులకు కారణంగా ఉద్యోగం కొరకు ప్రయత్నించే స్తే ఉడ్నే. (Udney) అనే అతని సహాయంతో మాల్డా సమీపంలోని ముడ్నబాటి (పద్మావతి) (Mudnabati) అనే గ్రామంలోని నీలి మందు కర్మాగారంలో ఉద్యోగం లభించింది. నీలిమందు కర్మాగారంలోని ప్రజలతో అతి సన్నిహితంగా మెలిగిన కారణాన బెంగాలి భాష చాలత్వరగా నేర్చుకున్నాడు. కేరీ స్థానిక భాషలు నేర్చి బైబిలు అనువదించి ముద్రించాలనేది అతని ముఖ్యాశయం. ఈ విషయం తన సంఘం అయిన లండన్ మిషనరీ సొసైటీకి (Londan Missionary Society) కి తెలియజేశాడు. అతనికి సాహయ్యంగా జాషువా మార్షమన్ (Joshua Marshaman) విలియంవార్డ్ (Willam Ward) లను ఎంపికచేసి 1799 అక్టోబరు 13 నాటికి భారతదేశానికి పంపారు.

మార్ష్‌మన్ భాషా శాస్త్రవేత్తగా, అనువాదకునిగా, సంపాదకునిగా, పుస్తక విక్రేతగానూ, ముఖ్యంగా ముద్రణలో అనుభవశాలిగా అంతర్జాతీయంగా పేరుగడించినాడు. విలియంవార్డ్ అతి సామాన్యమైన వడ్రంగి కుటుంబానికి చెందినవాడు. అయితే ముద్రణలో మంచి తర్ఫీదు నొందినాడు. ఎంతో ఉత్సాహంతో భారతదేశానికి మిషనరీగా, ప్రెస్ సూపరెండెంటు (Press Superientendent) గా సేవచేయాలనే సత్సంకల్పంతో వచ్చాడు.

మార్ష్‌మన్, వార్డ్‌లు భారతదేశానికి వచ్చేనాటికి శ్రీరంగపట్టణం బ్రిటీషువారు కైవసం చేసుకొని దాదాపు సంవత్సరం అయింది. ఆ కారణంగా బ్రిటీషువారి రహస్యాలు బయటికి చేరకుండా కట్టుదిట్టం చేశారు. అందువల్ల ముద్రణకుగాని ముద్రణా యంత్ర స్థాపనకుగాని ప్రభుత్వం అనుమతి లభించలేదు. అదే కాలంలో సిరంపూరు డేనుల ఆధీనంలో ఉంది. కేరీ కూడా వారికి సంబంధించినవాడే గనుక సిరంపూరులో పాఠశాల స్థాపనకు, ప్రెస్ నిర్మాణానికి గవర్నరు అనుమతి లభించింది. వెంటనే 1800 లో పాఠశాలస్థాపన, ప్రెస్ నిర్మాణం జరిగింది. 1801 ఫిబ్రవరి 7 నాటికి బెంగాలి భాషలో క్రొత్తనిబంధన అచ్చు అయింది. ఇదే వారు ప్రచురించిన ప్రథమ ముద్రణ.[2]

సిరంపూరులో 1801 నుండి 1832 వరకూ 47 భాషల్లో ముద్రణ జరిగింది. 40 భాషలకు సంబంధించిన పోత అక్షరాలు తయారుచేసి భారతదేశానికంతటికి సరఫరాచేసి ప్రేరణ కలిగించినట్టు ఈ క్రింది ఆధారం తెలుపగలదు.

---

2) Mangamma, J. Book Printing in India, P. 45.

"The tenth memoir respecting the translations (1834) say that printing had been done by at Serampore in forty seven languages, for above forty of which types had been cast at Serampore. Serampore had also become the source of supply for entire country in the matter of types and presses were started every where.' [3]

1801 నుండి 1832 వరకు బైబిళ్ళు వ్యాకరణాలు నిఘంటువులు. రామాయణం మొదలైనవి 47 భాషల్లో 2.12.000 వేల గ్రంధాల ముద్రణ జరిగింది. అయితే కేవలం బైబిలుకు సంబంధించినవి మాత్రం 33 భాషల్లోనే జరిగినట్లు తెలుస్తుంది.

Versions of Scriptures translated or Printing at Serampore.[4]

| | | |
|---|---|---|
| 1) సంస్కృతము | 12) పుష్తో | 23) బిర్కనీరా |
| 2) హిందీ | 13) పంజాబి | 24) ఉదయపురా |
| 3) బ్రిజ్ భాషా | 14) కాశ్మీరి | 25) మార్వా |
| 4) మరాఠా | 15) అస్సామి | 26) జయపూర |
| 5) బెంగాలి | 16) బర్మా | 27) కున్కురా |
| 6) ఒరిస్సా | 17) పాలి | 28) తముళ్ |
| 7) తెలింగా | 18) చైనీస్ | 29) సింగాలిస్ |
| 8) కర్ణాటా | 19) ఖాసి | 30) అర్మీనియా |

3) Katharine Smith Diehl, Early Indian imprints, Page. 64. London 1964.

4) Haddon, J. Brief View of the Baptist Missions and translations with specimans of various languages in which the scriptures and printing at mission press, Serampore, London, 8145.

9) మాల్డివియన్ 20) సింధ్ 31) మలయా
10) గుజరాతీ 21) పుచ్ 32) హిందుస్థానీ
11) ఖ్లోషి 22) నేపాల 33) పర్షియన్

నిఘంటువులలో 1) బెంగాలి 2) సంస్కృతం 3) మరాఠి భాషల్లో ముద్రించిన గ్రంథాలు నేటికి సిరంపూరు కేరీ గ్రంథాలయంలో భద్రపరుపబడి ఉన్నాయి. 1815 నాటికి కేరీ వివిధ భాషల్లో రచించి ముద్రించిన వ్యాకరణ గ్రంథాలు[5]

1) సంస్కృతం 2) చైనా 3) బర్మా 4) బెంగాలి 5) మరాఠా 6) పంజాబీ 7) తెలుగు.

కేరీ స్థానికులైన పండితుల సహాయ్యంతో అనువాదాలు. వ్యాకరణ నిఘంటువుల రచనలు చేసినా ఎక్కడా సాహాయ్యకుల పేర్లు మాత్రం ఉదాహరించలేదు. వారినిగూర్చి Native Pundits, learned pundits, Learned Munshis, Native assistants

అని మాత్రమే పేర్కొనడం జరిగింది. కాని తెలుగు సాహాయ్యకులను గూర్చి

"That respecting the Telinga version is given by the brother of Chief Pundit in the Sudder Dewanee Adwalut the Chief Native court of Judicature in Calcutta, who is a native of Telinga Country and one of the ablest pundits now to be

5) Marshaman, J. The life and times of carey marshman and ward or the History of Serampore misson - vol - II P. 98, London, 1859.

found in India. The Testimony of Nageshwar Shastree, elder brother of Sooba Shastree, Chief Pundit in the Sudder Dewanee Adwalut.[6]

సుబ్బశాస్త్రిని గూర్చి కేరీ వ్రాసిన తెలుగు వ్యాకరణ పీఠికలో

"The writer for this book is happly to acknowledge the assistance has received in writing it from Sooba Shastri, one of the Pundits of the Sudder Dewanee Adawlut, who is one of the best Sungskrit Scholars now living and an excellent Grammarian."[7]

పైన పేర్కొన్నట్టు సుబ్బశాస్త్రి విషయం ఎడనెడ కన్పించినా నాగేశ్వరశాస్త్రి ఉనికి తెలియదు.

సిరంపూరు ప్రెస్ 1812 మార్చి 12వ తేదీన ఘోర అగ్ని ప్రమాదానికి గురి అయింది. ఈ అగ్ని ప్రమాదంలో 14 భాషల్లోని పోత అక్షరాలు, 12 వందల రీముల కాగితం, కాగితపు ప్రతులయిన సమానార్థక పద నిఘంటువు, తెలుగు వ్యాకరణం, బెంగాలి నిఘంటువు, రామాయణం, భస్మీ పటలం అయినట్లు

Manuscripts to the worth of 7,000 Rupees, among which the materials for a polyglot Indian dictionary embracing all the languages derived from sanskrit, great part of Bengalee dictionary the

---

6) Haddson, J. Cit. Appendix - PP. 50 - 51.

7) Garey, W. Grammar of the Telenga language. 1814, preface page - 2.

copy of the Telugu grammer, the excellent copies of Ramayana."[8]

కాని రామాయణం మాత్రమే పూర్తిగా దగ్ధమైనట్టూ తెలుగు వ్యాకరణం, సమానార్థక పద నిఘంటువు పాడైనట్టూ ఈ క్రింది ఆధారం తెలుప గలదు.

The Manuscripts of the translation of the Ramayanum was entirely destroyed. and work was never resumed. The materials for the polyglot dictionry and the rough copy of the Telenga grammar as well as all the versions in the press perished.[9]

తెలుగు వ్యాకరణం 1814 లో అచ్చు అయింది. ఈ కాపీ ప్రస్తుతం నేషనల్ లైబ్రరీ కలకత్తాలో ఉంది. కాని సమానార్థక పదనిఘంటువు మాత్రం ఈ నాటికీ అముద్రితం. ఈ ప్రతి కేరీ గ్రంథాలయం. సిరంపూరులో భద్రపరుపబడివుంది. ఇది ఒక చెక్కపెట్టెలో పెట్టి క్రింది అంతస్తులోని "ఎయిర్ కండిషన్డ్" గదిలో అపురూపమైన గ్రంథాలతో పాటుగా భద్రంగా 'బైండింగ్' చేయించి ఉంచారు.

చేతితో తయారయిన (hand made paper) ఈ కాగితం పసుపు రంగులో దళసరిగా ఉంటుంది. కాగితం క్రిమిదష్టం కాకుండా ఉండేటందుకు క్రిమిసంహారక రసాయనాలలో ఎండబెట్టినట్టు

8) Katherine Smith Dehil, cit. P. 56, London, 1964.

9) John Clark Marshman, the history of Serampore mission - Vol - II P. 468, London. 1859.

తెలుస్తుంది. కాగితానికి ఒకవైపు మాత్రమే నల్లని సిరాతో వ్రాసి వుంది. పదమూడు భాషల పేర్లు వేర్వేరు గళ్ళలో వ్రాసివున్నాయి. చివరిపుటల్లో మాత్రం గళ్ళలో భాషల పేర్లకు బదులు [illegible] అంకెలు 1 నుండి 13 వరకు వేసివున్నాయి. [illegible] పెన్సిలుతో ఇంగ్లీషు అంకెలతో వేశారు. ఏ పుటలో[illegible] లేదు. ప్రతి పుటకూ 6 నుండి 8 పంక్తులున్నాయి. [illegible] కూడాలేదు. కాగితం పొడవు 52 సెం. మీ. వెడల్పు [illegible] సెం. మీ. మొత్తం పుటల సంఖ్య 312. పదాల సంఖ్య [illegible]. [illegible] ముగ్గురి చేతి వ్రాతలు కన్పిస్తున్నాయి. గ్రంథాలయ [illegible] అభిప్రాయం మేరకు (శ్రీ సునీల్ కుమార్ [illegible] సంభాషణ) ఇందలి దస్తూరిలలో ఒకటి కేరీది కావచ్చు[illegible] పరాయూత ప్రతీతి. దీనిని బాగాముగా నిర్ధారించడానికి [illegible] నిదర్శనము లభించలేదు. కొన్ని పుటలలో ఎడమవైపు [illegible] లున్నాయి. ఇందు పొందుపరుపబడిన భాషలకి [illegible] వ్రాశారు.

ఈ సమానార్థక పదనిఘంటువునుగూర్చి 10వ [illegible]
(Memoir) లో I mean to take the sungskrit of course as the ground work and to give the different acceptations of every word with examples. of their applications in the manner of Johnson, and then to give Synonymes in different languages derived from sungskrit with Hebrew and Greek terms answering there to .... "This work will be great and it is doubtful whether I shall live to complete it but I mean to arrange the meterials which I have

been collecting, some years for this purpose, as soon as my Bengali dictionary is finished."[10]

కేరీ పేర్కొన్నట్టు ఈ గ్రంథంలో హిబ్రూ, గ్రీకు పదాలు తర్వాత చేర్చాలనే తలంపు ఉన్నా ఏ కారణాల వల్లనో అవి చేర్చ లేదు. ఈ అముద్రిత గ్రంథంలో చేర్చాలన్నా అందుకు ఖాళీకూడా లేదు.

| ఈ గ్రంథమందు ఉట్టంకించిన రూపం | నేటిరూపం |
|---|---|
| 1) సంస్కృత భాషా | 1 సంస్కృతం |
| 2) కాశ్మీరి భాషా | 2) కాశ్మీరి |
| 3) పంజాబో జాంఘీర్ అంతర్గతభాషా | 3) పంజాబి జలంధర్ |
| 4) మధ్యప్రదేశ్ భాషా | 4) మధ్యప్రదేశ్ (కావచ్చు) |
| 5) పర్వతి భాషా | 5) పర్వతి భాషా |
| 6) మిథిల భాషా | 6) మైథిలి |
| 7) బంగ్లా భాషా | 7) బెంగాలి |
| 8) ఉత్కల్ భాషా | 8) ఒరియా |
| 9) మహారాష్ట్ర భాషా | 9) మరాఠి |
| 10) గుజ్జడ భాషా | 10) గుజరాతి |
| 11) తెలింగా భాషా | 11) తెలుగు |
| 12) కర్నాట భాషా | 12) కన్నడం |
| 13) ద్రవిడ భాషా | 13) తమిళం |

10) Haddon, J, Cit. PP-55,56 London - 1845.

ఈ ప్రతినమునా అనుబంధంలో చేర్చుతున్నాను. అముద్రిత గ్రంథంలో బెంగాలిపి వాడినా నమూనాలో తెలుగు లిపిలో ఇస్తున్నాను.

ఈ గ్రంథం గనుక కేరీ ముద్రించినట్లయితే భాషానిఘంటు కారునిగా కేరీకి అంతర్జాతీయంగా ఖ్యాతి లభించి ఉండేది.

ఈ అపురూపమైన ఈ నిఘంటువు పరిశీలించడానికి అనుమతి నిచ్చిన గ్రంథాలయ పాలకవర్గం వారికి కృతజ్ఞతలు. బెంగాలి లిపిలో ఉన్నదాన్ని చక్కగా చదివి విశదం చేసిన మిత్రుడు 'అనిల్ దాన్'కి కృతజ్ఞతలు.

ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్.
తిరుపతి. 1981.



# తెలుగు క్రైస్తవుల వ్యక్తినామాలు

ప్రపంచమంతా నామాశ్రిత సంజ్ఞాచిహ్నిత వ్యవహృతం. సాగరాలు, ఖండాలు, దేశాలు, ప్రాంతాలు, కులాలు, వర్ణాలు, తెగలు కుటుంబాలు, వ్యక్తులు మొదలయినవి ఒకదానికంటె మరొకటి అని నిర్దేశించడంకోసం దేశంలోగల రాష్ట్రాలు, మండలాలు, జనావాసాలు. పర్వతాలు, నదులు, అరణ్యాలు, చిట్టడవులు గుట్టలు ప్రకృతిలోగల పదార్థాలన్నింటికీ నైసర్గికంగా ఏదో ఒక పేరు ఉంటుంది. జనసమూహాలలో వర్గాలు, వర్ణాలు, కులాలు, తెగలు, శాఖలు, కుటుంబాలు, వ్యక్తులు. యిలా ప్రతి దానికి ఏదో ఒక సంజ్ఞ ఉంటుంది. ఒకదానినుండి వేరొకదానిని నిరూపించడానికి నామం ఏర్పడింది. ప్రకృత చర్చ సంజ్ఞావాచకాలలోని వ్యక్తివాచకాలకు పరిమితం అందునా తెలుగుదేశంలోని క్రైస్తవ మతానుయాయుల వ్యక్తినామాలకు పరిమితం.

నామకరణం అన్నది అన్ని సమాజాలలోనూ, అన్ని మత విశ్వాసాలలోనూ వుంది. హైందవ సమాజంలోని షోడశ కర్మలయిన గర్భాదానం, పుంసవం, సీమంతం, జాతకర్మ నామకరణం అన్నప్రాసనం, చౌలము, ఉపనయనం, ప్రాజాపత్యం సౌమ్యం, ఆగ్నేయం, వైశ్వదేవం, గోదానం, సమావర్తనం, విహహం, అంత్యకర్మం, అగు పదారు సంస్కారాలలో నామకరణం ఒకటి. సాధారణంగా మన పేర్లలో తాతముత్తాతల పేర్లో, తమ యిష్టదేవతల పేర్లో, కులదేవతల పేర్లో, చరిత్ర ప్రసిద్ధుల పేర్లో తమ పిల్లలకు పెట్టడం ఆనవాయితీ. పిల్లల గుణగణాలకు, స్వరూపస్వభావాలకు సంబంధం లేకపోయినా తమ ముద్దుముచ్చటలు తీర్చుకోవడానికి

తల్లిదండ్రులు. చుట్టపక్కాలు ఈ నామకరణాలలో ప్రధానపాత్ర వహిస్తారు.

క్రైస్తవమతానికి పవిత్రగ్రంథం బైబిలు. బైబిలు ఆధారం ప్రకారం బిడ్డ పుట్టగనే తల్లి నామకరణం చేయడం.[1] తండ్రి పేరు పెట్టడం[2]. కొన్ని సందర్భాలలో బంధువులు[3] పేరు పెట్టినట్టు తెలుస్తుంది. అదే క్రొత్తనిబంధనలో సున్నతిచేసినరోజున నామకరణం చేసినట్టు నిరూపితం[4].

క్రైస్తవమతంలో కేతలిక్. ప్రొటస్టెంట్ అని ముఖ్యమైన శాఖలు రెండు. ప్రొటస్టెంట్ శాఖలో ఇంకా ఎన్నెన్నో ఉపశాఖలున్నాయి. అయితే నామకరణం రకరకాలుగా జరుగుతుంది. కేతలిక్ శాఖలో బిడ్డ పుట్టిన ఎనిమిదోనాడు లేదా తల్లి ఆరోగ్యాన్ని బట్టి ఆ తరువాత ఏదో ఒకఆదివారం దేవాలయంలో తల్లిదండ్రులు. బంధువులతో కలిసి నామకరణం చేస్తారు నామకరణం నాడు స్నానంచేసి. కొత్తబట్టలు వేసి ఆలయ ముఖద్వారంవద్ద చేతిలో వెలుగుతున్న మైనపువత్తిని ఉంచి ఆ ఫాదర్. బిషప్ ప్రార్థనచేసి ఆ పాపాయి నోట్లో రవ్వంత ఉప్పు అంటించి ఆలయ ప్రవేశం చేయిస్తారు. ముఖద్వారం నుండి అల్టరు (Alter) అనబడే మంటపంవద్దకు శాస్త్రోక్తంగా బైబిలు పారాయణంచేస్తూనో. పాటలు

---

1. ఆదికాండము 4 : 1; 29 : 32-37
2. ,, 4 : 26; 16 : 15; 21 : 3
   II సమూయేలు 12 : 24-25
3. రూతు 4 : 17
4. లూకా 1 : 59, 2 : 12

పాడుతూనో తీసికొనివెళ్తారు. అక్కడ తలపై నీళ్ళు చిలకరించి (జ్ఞానస్నానం, Baptism) నామకరణంచేసి సంఘానికి ఆపేరు ప్రకటిస్తారు. ఈ తతంగం అంతా ఆదివారంగాని, మరో పండుగ నాడుగాని దేవాలయంలో సభ్యులందరి ఎదుటనే జరుగుతుంది. చేతిలో వెలుగుతున్న మైనపువత్తి లోకానికి ఆ పాపాయి వెలుగుగా ఉండాలనీ, నోటిలో ఉప్పు అంటించడం మొట్టమొదటిగా పత్రుడుచు లలో ఒకదానిని తెలియజేయడమేకాకుండా సారవంతమైన ఉప్పులా జీవితాన్ని కొనసాగించమని ముఖ్య సూచన అనిభావించబడుతోంది.

ప్రొటస్టెంట్ శాఖల్లో ఈ నామకరణం రకరకాలు. కొందరు పాపాయి పుట్టిన మొదటివారంలో పాస్టర్, బిషప్ లేదా ప్రీస్ట్ చేత మామూలుగా నామకరణం చేయిస్తే మరికొందరు ఓ యేడాదిలోగా జ్ఞానస్నానం (బాప్టిజం) తోపాటు గుడిలో నామకరణం చేయిస్తారు. కొన్ని సందర్భాలలో బంధుమిత్రులతోకలసి యింటివద్ద నామకరణ మహోత్సవం ఆర్భాటంగా చేయించి గుడిలో ప్రకటించడంకూడా జరుగుతుంది. ఇది వారివారి అనుకూలాన్నిబట్టి. సమయాన్నిబట్టి చేయడం జరుగుతుంది. పసిపిల్లలకు బాప్టిజం ఇచ్చి నామకరణం చేయడం బైబిల్లో ఎక్కడాలేదు. ఈ ఆచారం క్రి. శ. 3వ శతాబ్దం మధ్యకాలంలో ఉత్తర ఆఫ్రికాలో ఆరంభమై క్రమక్రమంగా వాడుకలోకి వచ్చిందని తలంపు.[5]

ఆంధ్రదేశానికి క్రైస్తవమతం వ్యాప్తికి వచ్చిన అనంతరం బాప్టిజంనాడే క్రైస్తవ నామకరణం చేయడం జరిగింది. అతని పూర్వం ఉన్ననామంతో క్రైస్తవ నామకరణం చేయడమో, కేవలం క్రైస్తవనామం మాత్రమే పెట్టడమో జరిగింది.

---

5) రెవ. వల్లియము. జాన్సు, సంఘసార సంగ్రహము, రామాపట్నం, నెల్లూరు, ఆరవ ముద్రణ 1951, పుట 78.

ప్రకృతం వాడుకలో ఉన్న క్రైస్తవనామాలన్నీ మొట్ట మొదట హిబ్రూ భాషాపదాలుగా ఆరంభమయినాయి.[6] క్రైస్తవ నామాల అర్థం గమనించినట్లయితే హిబ్రూ పదాలు దైవభక్తిని, ట్యుటోనిక్ పదాలు ప్రభుచిహ్నాలగు మహావీర శూరత్వాలు, కెల్టిక్ పదాలు మానవధర్మ లక్షణాలను, లాటిన్ పదాలు దైవ చిహ్నాలగు జన్మసంఖ్యలు, తీర్థయాత్రా విశేషాలు, స్త్రీల పేర్లలో స్త్రీ సౌంద ర్యాన్ని శౌర్యధైర్యసాహసాదులతోపాటు గృహిణీ లక్షణాలు, మౌక్తికాది రత్నాలపేర్లు మొదలయినవి ప్రధానపాత్ర వహిస్తాయి.[7]

ఈ నామాలలో ప్రాతిపదికలో మార్పులేకుండా దాదాపు తత్సమ రూపాలలో ఉన్న పేర్లు.

కింది ఉట్టంకితాలన్నీ అయా భాషలనుండి సమీపమాతృకగా అనూదితమైనవి. మొదట తెలుగురూపం - సమీపమాతృక - ఆ పదానికిగల అర్థం వివరించబడింది.

## I

## హిబ్రూ

| తెలుగు రూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| అజర్యా | > | 'అజర్యా' | : | యెహోవాసహాయం |
| అజరయ్య | | | | |
| అబ్రాము | < | 'అబ్రహామ్' | : | జనసంఘానికి జనకుడు |
| అబ్రహాము | | | | |

6) ప్రసాదభూపాలుడు, జమీందార్ ఆఫ్ దేవిడి, ఆంధ్ర విజ్ఞానము, 'క్రైస్తవ నామములు' పుట 853.

7) పైదే. పుట 858.

| తెలుగురూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| అబ్షాలోము | < | 'అబ్షాలోమ్' | : | శాంతిపిత |
| అరోను<br>ఆహరోను | < | 'అహరోన్' | : | కాంతిగల |
| ఆదాము | < | 'ఆదం' | : | పురుషుడు, నిర్మింపబడినవాడు, ఎర్రనివాడు |
| ఇమ్మానుయేలు | < | 'ఇమ్మానుఏల్' | : | దేవునితోడు |
| ఇస్సాకు | < | 'ఇసాక్' | : | అతడు నవ్వును |
| ఎజ్రా | < | 'ఎజ్రా' | : | సహాయం |
| ఏలియా | < | 'ఏలియా' | : | యెహోవా నాదేవుడు |
| ఏశావు | < | 'ఈశావ్' | : | కేశములు గలవాడు |
| గబ్రియేలు | < | 'గబ్రియెల్' | : | దేవునివాడు |
| గమలీయేలు | < | 'గమలీయెల్' | : | దేవుని బహుమానం |
| జకర్యా | < | 'జకర్యా' | : | యెహోవాను స్మరించువాడు |
| దావీదు | < | 'దావిద్' | : | ప్రియమైన |
| నోవహు | < | 'నోవాహ్' | : | విశ్రాంతి, ఆదరణ |
| యాకోబు | < | 'యాకుబ్' | : | మోసగాడు |
| యోనా | < | 'యోనా' | : | గువ్వ |
| యోనాతాను | < | 'యోనా' | : | యెహోవా అనుగ్రహం |
| యోబు | < | 'యోబు' | : | దేవునివైపు తిరుగువాడు |
| యోసేపు | < | 'యోసఫ్' | : | స్వప్నఫల మెరిగిన జ్ఞాని |
| యోహాను | < | 'యోహానాన్' | : | యెహోవాదయ |
| యెహోషువ | < | 'యేహోషువ' | : | యెహోవారక్షణ |
| లాబాను | < | 'లాబాన్' | : | తెల్లని |

## స్త్రీల పేర్లు

| తెలుగురూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| దీనా | < | 'దీనా' | : | న్యాయం, తీర్పు |
| దెబోరా | < | 'దెబోరా' | : | తేనెటీగ |
| రాహెల్ | < | 'రాహెల్' | : | ఆడుగొఱ్ఱె |
| రేచల్ | | | | |
| రూతు | > | 'రూత్' | : | అందమైన |
| హవ్వ | > | 'హవ్వా' | : | జీవముగల |

## గ్రీకు

| | | | | |
|---|---|---|---|---|
| అంద్రియ | < | 'అంద్రియాస్' | : | పౌరుషముగల |
| అగ్రిప్ప | < | 'అగ్రఫోస్' | : | లిఖించని విషయం |
| క్రిస్టొఫర్ | < | 'క్రిస్టోఫర్' | : | క్రీస్తునుమోయు |
| క్రిస్టియన్ | < | 'క్రిస్టియన్' | : | క్రీస్తుగలవాడు |
| థియోడర్ | < | 'థియోడర్' | : | దైవసహాయం |
| మార్కు | < | 'మార్కస్' | : | సుత్తి |
| లాజరు | < | 'లాజరోస్' | : | దేవసహాయం |
| (ఎలియాజరుకు రూపాంతరం) | | | | |
| స్తెఫను | < | 'స్తెఫనస్' | : | కిరీటధారి |

## స్త్రీల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| అగాత | < | 'అగాత | : | దయగల |
| ఆగ్నెసు | < | 'అగ్నెస్' | : | పతివ్రత |
| ఇవాంజలిన్ | < | 'ఇవాంజలిన్' | : | సంతసవార్తలను తెలుపు వనిత |

| తెలుగురూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| తెరిస్సా | < | 'తెరిస్సా' | : | ఈనుచున్న పొట్టలుగల (వరి మొదలగుసస్యవిశేషం) |
| తెక్లా | < | 'తెక్లా' | : | దైవసంబంధమగు |
| మార్గరెటు | < | 'మార్గరెట్' | : | ముత్యం |
| సింతియా | < | 'సింతియా' | : | దేవత |

## లాటిన్

| | | | | |
|---|---|---|---|---|
| అంతోని | < | 'అంతోని' | : | అమూల్యమైన |
| ఇగ్నేషియస్ | < | 'ఇగ్నేషియస్' | : | రూపనిష్పత్తి అస్పష్టం |
| పౌలు | < | 'పౌలస్' | : | చిన్నవాడు |

## స్త్రీల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| క్లారా | < | 'క్లారా' | : | ప్రకాశవంతమైన |
| జూలీ | < | 'జూలియ' | : | మెత్తని కురులుగనది |
| వయోలా | < | 'వయోలా' | : | ఉదారంగు |
| స్టెల్లా | < | 'స్టెల్లా' | : | నక్షత్రం |

ఆంగ్ల నామాలలో ఆధునికమైనవి కోకొల్లలు. లాటిన్‌భాషా ఘటితంగా తెలుగులో వచ్చిన రూపాలు ఎడనెడా కన్పిస్తాయి. హీబ్రూపదాలు ఆంగ్ల రూపాలలో ఎడం, ఐజక్, జాకబ్, జాన్, జోసఫ్, జేమ్స్, డేవిడ్ మొదలగునవన్నీ లాటిన్ నుండి ఆంగ్ల రూపాలుగా సాక్షాత్కరిస్తాయి. ఐతే నవీననామాలలో ఆంగ్లంలోని నామాలుకూడా అక్కడక్కడా కన్పిస్తాయి. ఇవి బైబిలు రూపాలు కావు. వాటి అర్థం కూడా బోధపడదు. ఎక్కువభాగం చరిత్ర ప్రసిద్ధులైనవారి పేర్లే యిలా కన్పిస్తాయి:

## ఇంగ్లీషు

| తెలుగురూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| క్లారెన్స్ | < | క్లారెన్స్ | : | అర్థం తెలియదు |
| గోర్డన్ | < | గోర్డన్ | | |
| గ్రేహం | < | గ్రేహం | | .. |
| జేవియర్ | < | జేవియర్ | | .. |
| మార్టిన్ | < | మార్టిన్ | | .. |
| మెకాలె | < | మెకాలె | | .. |
| వాల్టర్ | < | వాల్టర్ | | .. |

## స్త్రీల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| లూసీ | < | 'లూసీ' | | |
| మార్గరెట్ | < | 'మార్గరెట్' | : | ముత్యం |
| మెర్సీ | < | 'మెర్సీ' | : | దయ |

## II

సమీప మాతృకానువాదాలలో దాదాపు ద్వంద్వరూపాల వంటివి కొన్ని కన్పిస్తాయి. ఈ పేర్లు సమీప మాతృక నుండి వ్యావహారిక రూపాలు మాత్రమే ఉదాహృతాలు. దాదాపు తత్సమ రూపాలలో ఉన్నవే ఈ ప్రకరణంలో చోటుచేసుకున్నాయి.

## హెబ్రూ

యేసోపు

యేసోబు

| తెలుగురూపం | సమీపమాతృక | అర్థం |
|---|---|---|
| జోజయ | < 'యోసఫ్' | : స్వప్నఫల మెరింగిన జ్ఞాని |
| జోజప్ప | | |
| జోజిస్వామి | | |
| జోజప్ప | | |
| యాకోబు | < యాకుబ్ | : మోసగాడు |
| యోహాను | < యోహాన్ | : యెహోవాదయ |

## గ్రీకు

| | | |
|---|---|---|
| జాషక్ | < 'జాషువా' | : స్వస్థపరచువాడు |
| జిమ్మి | < 'జేమ్స్' | : కాంతిగలవాడు |
| జేమ్స్ | | |

## స్త్రీల పేర్లు

| | | |
|---|---|---|
| బెట్టి | < 'బెరిల్' | : అస్పష్టం |
| బెట్టిమ్మ | | |
| డోలి, డోరా | < 'డోరతి' | : దేవునిదానం |
| డోరతి | | |
| నోలా | < 'లీనా' | : కాంతి |
| హెల్మా | | |

## లాటిన్

| | | |
|---|---|---|
| మేక్స్మిలన్ | < మేక్స్మిలన్ | : గొప్పవాడు |

## స్త్రీల పేర్లు

| తెలుగురూపం | | సమీపమాతృక | | అర్థం |
|---|---|---|---|---|
| అనబెల్లా | < | అనబెల్లా | | |
| అన్నా | < | ఏన్ | : | అస్పష్టం |
| అన్నమ్మ | | | | |
| రోజమ్మ | < | రోసా | : | గులాబి |
| రోజినమ్మ | | | | |
| డయానా | < | *డివియానా | : | అస్పష్టం |
| సీలియా | < | *సిసిల్ | : | అంధురాలు |
| సీలియమ్మ | | | | |
| స్టెల్లా | < | స్టెల్లా | : | నక్షత్రం |

## III

## అనూదితాదానాలు

ఈ ప్రకరణంలోని నామాలన్నీ సమీప మాతృకలలోని అర్థాన్ని గ్రహించి దేశీయపరమైన పేర్లు పెట్టినట్లూహించవచ్చు.

### హిబ్రూ

| | | | | |
|---|---|---|---|---|
| దైవసహాయం | | | | |
| దైవనిరీక్షణ | < | *ఎలీషా | : | దైవరక్షణ |
| ప్రభుదైవకుమారి | | | | |
| —ప్రేమ | | | | |
| —ఆయ్య | | | | |

| తెలుగురూపం | సమీపమాతృక | అర్థం |
|---|---|---|
| రాయమ్మ | < 'పీటర్' | |
| రాయకుమార్ | ఆం. రూ. | |
| రాయరాజు | | |

## లాటిన్

| | | |
|---|---|---|
| దీవెనయ్య | | |
| దీవెనమ్మ | | |
| ఆశీర్వాదం | < 'బెనిడిక్టో' | : ఆశీర్వాదం |
| ఆశీర్వాదప్ప | | |
| ఆశీర్వాదయ్య | | |
| కుసుమ | | |
| కుమారి | < 'ఫ్లోరా' | : పుష్పం |
| రాణి | | |

## III
## పునరుక్త రూపాలు

భిన్నభాషలలో ఏకార్థరూపకాలయిన పునరుక్త రూపాలు అక్కడక్కడా కన్పిస్తాయి. మచ్చుకు కొన్ని

| | | |
|---|---|---|
| హన్నా-కటాక్షం | < 'హన్నా | : కటాక్షం |
| మెర్సీ -కటాక్షం | | |
| మెర్సీ-దయమ్మ | | |
| మెర్సీ-దయామణి | | |
| మెర్సీకృపారాణి | < 'మెర్సీ | : దయ |

తెలుగురూపం సమీపమాతృక అర్థం

మేర్సీ-కృపావతి
కరుణ-కృప
విక్టర్-జయరాజు
విక్టర్-జయరాజు < 'విక్టర్' : విజయం
విక్టర్-విజయరత్నం
విక్టర్-విజయాకర్

V

## మిశ్రమ రూపాలు

తెలుగు క్రైస్తవుల పేర్లతో కలిపి కొన్ని క్రైస్తవేతర నామాలుకూడా చోటు చేసుకున్నాయి. ఆయా ప్రాంతాలలో దేశీయపరమైన పేర్లతో కలిపి నామకరణం చేయడం సామాన్యంగా కన్పిస్తుంది. ఈరకమైన నామకరణాలకు స్థూలంగా ఈ రకమైన కారణాలు నిర్దేశించవీలుగాని, ఆధారాలుగానిలేవు. కేవలం దేశీయ పరమైన పేర్లు ప్రసిద్ధిగాంచిన కారణానగానీ, మతాంతరీకరణ సందర్భాలలో వారివారి పూర్వ వ్యక్తుల నామాలతోగాని కలిపి నామకరణం చేయడం పరిపాటి.

ఎస్తేరుశకుంతలాముకారి
కనకాభిషేకకుమారి
క్రీస్తురాజ్యలక్ష్మి
మేరిలక్ష్మిలలితకుమారి
మేరిసరస్వతి

మొదలగుపేర్లు వెదకినకొద్దీ లభిస్తాయి. అయితే కులాలనో, తెగలనో సూచించే పెట్టుడు పేర్లు ఆచారి, రాజు, రావు, రెడ్డి, చౌదరి, నాయుడు, శాస్త్రి, శర్మ, వర్మ మొదలగువాటితో మిశ్రితమైన నామాలుకూడా కన్పిస్తాయి.

క్రైస్తాచారి, సాల్‌మన్‌నారాయణరాజు, ఇన్నారావు, జాన్‌లక్ష్మిపతిరావు, ఇన్నారెడ్డి, అంతొనిరెడ్డి, పురుషోత్తమచౌదరి, జాన్‌చౌదరి బెంజిమిన్‌బ్రహ్మనాయుడు, జాకబ్‌శాస్త్రి, మార్టిన్‌లూథర్‌శాస్త్రి, జోసఫ్‌లక్ష్మణశర్మ, విజయరవివర్మ మొదలయిన పేర్లు కన్పిస్తాయి. పూర్తిగా దేశీయమైన నామాలలో కాథలిక్‌శాఖలో అధికంగా కన్పిస్తాయి. సమీపమాతృక అర్థాన్నిబట్టి, ఆయా పుణ్యవ్యక్తుల స్వభావాన్నిబట్టి పేర్లు పెట్టడం కన్పిస్తుంది.

| తెలుగురూపం | సమీపమాతృక | అర్థం |
|---|---|---|
| అరుళప్ప | తమిళం | |
| అరుళయ్య | < 'అరుళ్' | : ప్రేమ |
| అరుళమ్మ | | |

## లాటిన్

| | | |
|---|---|---|
| చిన్నయ్య | | |
| చిన్నప్ప | < 'పౌలస్' | : పొట్టిమనిషి |
| చిన్నమ్మ | | |
| ఆశీర్వాదం | | |
| ఆశీర్వాదప్ప | < బెనిడిక్టో | : ఆశీర్వాదం |

| తెలుగురూపం | సమీపమాతృక | అర్థం |
|---|---|---|
| ఆశీర్వాదమ్మ | | |
| శౌరయ్య | | |
| శౌరప్ప | | |
| శౌరమ్మ | < జేవియర్ | : శౌర్యముగల |
| శౌరి | | |
| శౌర్యశ్రీ | | |
| రాయప్ప | | |
| రాయన్న | < 'పెత్రో' | : రాయి |
| రాయప్పరాజు | పేతురు | |
| రాయకుమార్ | | |

పండుగలకు వ్యక్తినామాలకు కొంత సంబంధం ఉంది. పండుగనాడు జన్మించిన కారణాన ఆ పండుగ పేరు వచ్చేలా నామకరణం చేయడం. ఈరకమైన నామాలు అతితక్కువ.

ఈస్టర్ వసంతకుమారి

క్రిస్మస్‌క్రిస్టినా

తండ్రిపేరుతోగాని, లేదా రెండుమూడు పేర్లు కలిపి నామకరణం చేయడం సర్వసామాన్యం. ఈరకమైన నామాలలోనే క్రైస్తవమతంలో సామాన్యంగా ప్రార్థనా నంతరం పలికే ఆమెన్ (తథాస్తు). మతబోధలో మధ్యమధ్య 'ఎచ్చరికలు'గా 'హల్లెలూయ' అనేపదం ఉచ్చరిస్తారు. హిబ్రూభాషలో హల్లెలూయా అంటే 'యెహోవాకు స్తుతి కలుగును' అని అర్థం. ఈ పదంకూడా నామవాచకాలలో కన్పిస్తుంది.

అబ్రహాం సాలమన్‌రాజు. ఎడ్వర్డ్‌జోసఫ్. జాన్‌డేవిడ్. జోసఫ్ మేత్యూ. జేమ్స్ శామ్యూల్‌జాన్. థామస్‌డేవిడ్. మేరిఆమ్‌న్‌రాణి. అబ్రహాంహల్లెలూయరాజు మొదలయినవి. భగవత్ ప్రేరణవల్ల భక్తివల్ల దేశీయమైన అర్థం స్ఫురించే నామాలుకూడా కోకొల్లలు. ఏసుపాదం, ఏసుదాసు. దేవదానం. దైవసహాయం. దైవభక్తుడు. దైవభక్తుల్, ప్రభుపాదరేణువు. ప్రభుకుమారి లాంటివి. మంటలు మండే ఎండల్లో కుంభ వృష్టి కురిసిన కారణాన ఆనాడు పుట్టిన పాపకు సూజన్‌వర్షధార అని నామకరణం చేయడం ఎక్కడోగాని కన్పించదు. ఈ తెలుగు క్రైస్తవ నామాల పరిశీలన అనేది భావి పరిశోధనకుపకరించే అంశాలలో ఒకటి. ప్రస్తుతవ్యాసం విహంగావలోకనం మాత్రమే. అదీ పాక్షికమే.



# ప్రథమాంధ్ర గ్రంథ ప్రచురణకర్త బెంజమిన్ షూల్జి



(యునైటెడ్ థియోలాజికల్ కాలేజి, బెంగుళూరు వారి సౌజన్యంతో)

ప్రతియుగంలోనూ కొంతమంది మహాపురుషులవతరిస్తూ ఉంటారు. అలాంటి వారి వల్ల జన్మభూమికే కాకుండా యావత్ప్రపంచానికీ పేరు ప్రఖ్యాతలు కలుగుతుంటాయి. వారే అవతార పురుషులు, కారణజన్ములు. తరతరాల మన భాషా సంస్కృతులు నానాటికీ క్షీణించి పోయే దశలో పాశ్చాత్య వాణిజ్య సంస్థలు

వ్యాపారదృష్ట్యా భారతదేశానికి రావడంవల్ల మనకు ప్రత్యక్షంగా జరిగిన నష్టంకన్నా పరోక్షంగా జరిగిన లాభమే ఎక్కువ. వాణిజ్యం పేర ఏర్పరచిన రవాణాసౌకర్యాలు, మతప్రచారం పేర ఏర్పడిన పాశ్చాత్య విద్యావిధానం, గ్రంథ ముద్రణం, మత ప్రచారంలో భాగమైన వైద్యాలయాలు, అనాధాశ్రమాలు మొదలయిన వాటి స్థాపనవల్ల భారతదేశప్రజలు ప్రగతిపథంలో పయనించడానికి బాట వేసినట్టయింది. భాషావిజ్ఞానం కేవలం కొందరిసొత్తుగానే ఉన్న దానిని అందరికీ పంచి అక్షర బిక్షను పదిమందికి పంపకం జేసిన ఖ్యాతి పాశ్చాత్య మిషనరీలకే దక్కుతుంది. భాషా సాహిత్యాలతో బాటు ఐహికాముష్మిక అవసరాన్ని సయితం అందుబాటులో లేకుండా చేసిన మన సంస్కృతిని పటాపంచలుచేసి దేవాలయాలు నిర్మించి దేవుడనే వ్యక్తి యిలా ఉన్నాడని నిరూపించినవారు మిషనరీలు. కేవలం మిషనరీల మతప్రచారం ఇతరులను విజ్ఞానవంతులు చేయుడానికే తోడ్పడిందేతప్ప వారిస్వార్థం ఉందనే వారి వాదనలో బలం ఏమాత్రం లేదు. హరిజన, గిరిజనులను అస్పృశ్యులుగా ముద్రవేసి సంఘ బహిష్కృతులుగా పరిగణించే రోజుల్లో మిషనరీలు వారిని చేరదీసి ఆదరించి 'మీరూ మనుష్యులే' అని ప్రేమను పంచియిచ్చిన వారి విశాలభావాలకు సహృదయతకు నేడు జోహార్లు చెప్పవలసిందే. ఏనాడయితే భారతదేశంలో అంటరాని వారుగా పరిగణిస్తున్న వారిని మిషనరీలు చేరదీసి అన్నిరంగాలలో వారికి ప్రోత్సాహమిచ్చి వెన్ను తట్టి ఆదరించారో ఆనాడే వారు క్రైస్తవ మతంవైపు మొగ్గు చూపారు. స్వజాతీయుల ఆదరణ, ఆప్యాయత దొరకని దేశీయులు విదేశీయుల ప్రేమకు నోచుకుని వారి మతంవైపు మొగ్గుచూపడంలో తప్పు ఏమాత్రం లేదనిపిస్తుంది. క్రైస్తవమతంలో కేతలిక్, ప్రొటెస్టెంట్ అనే శాఖలు ముఖ్యమయినవి. ప్రొటెస్టెంట్ శాఖలో ఎన్నో

ఉపశాఖలున్నాయి. కేతలిక్‌వారు మొట్టమొదట అగ్రవర్ణాలవారిని క్రైస్తవులుగా చేయడానికి ప్రయత్నించారు. ప్రొటస్టెంట్ శాఖ వారు నిమ్నజాతులవారిని తీర్చిదిద్దడానికి ప్రయత్నించి కృత కృతులయారు. ఒక శాఖవారు ఒక ప్రాంతంలో మత ప్రచారం గావించే ప్రయత్నంలో ఉండగా మరోశాఖవారు ఆ ప్రాంతంలో అడుగుపెట్టక పోవడం వారి సహృదయతకు నిదర్శనం.

వ్యాపారానికీ, మత ప్రచారానికి పాశ్చాత్యులు భారత దేశంలో అడుగిడిన వెంటనే వారికి ఎదురయిన మొదటి సమస్య భాష. భారతీయ భాషాధ్యయనం కోసం వారు పడిన శ్రమ అంతిం తనరానదే. ఆ ప్రయత్నంలో భాగంగా యితరులకు ఆ అవస్థ కలుగకూడదనే ఆలోచనతో వారు భాషలు అభ్యసిస్తూ కోశ వ్యాకర ణాలు, నిఘంటువులు, చరిత్రలు, క్రైస్తవ గీతములు కూర్చి పేర్చి మన కందించారు. అదే సందర్భాన నూరాళ్లుగా అసూర్యం పశ్యలుగా భారతీయ ఇతిహాస పురాణాలనబడే భారతభాగవత రామాయణాలు చతుర్వేదాలు ఇంకాయితరమైన కావ్యాలు, భాష్యాలు ఆయా ప్రతులు సేకరించి అన్నింటినీ చూసి సిద్ధ ప్రతి తయారుచేయించి ముద్రించారు. అందువల్ల మన సంస్కృతి సంప్రదాయాలను పదికాలాలపాటు భద్రం చేసింది పాశ్చాత్యులే అని చెప్పక తప్పదు.

లూథరన్ ప్రొటస్టెంట్ శాఖకు చెందిన బెంజమిన్ షూల్జి (Benzamin Schultze) అనే జర్మన్ దేశీయుడు 1689 లో జన్మించాడు. అతని విద్యాభ్యాసం ఇతర వివరాలు లభ్యంకాలేదు. 1719 జులై 24 నాటికి భారతదేశానికి డెన్మార్కురాజు ఆదేశానుసారం మతప్రచారం నిమిత్తం వచ్చాడు.

అతః పూర్వమే జర్మనీదేశవాసులైన జిగెన్ బాగ్ (Ziegen balg) గ్రుండ్లర్ (Grundler) భారతదేశంలో ఈ సంస్థ తరఫున

మత ప్రచారం చేస్తున్నారు. బెంజమిన్ షూల్జి వీరితో కొంతకాలం గడపిన అనంతరం ట్రాంక్విబార్ వెళ్ళి అక్కడ తమిళం నేర్చుకుని 1927 నాటికి తమిళంలో బైబిలు అనువదించి ముద్రించాడు[1] 1728 నాటికి మద్రాసు తిరిగి వచ్చి అక్కడే స్థిరపడినట్లు తెలుస్తుంది. ప్రతి ఆదివారం తమిళ, తెలుగు, పోర్చుగీసు భాషల్లో వేర్వేరుగా ప్రార్ధనలు జరిపేవాడు[2] అదే సంవత్సరం 'వరుగియన్ గ్రామర్' (Warugian Grammar) రచించాడు.[3] అది తెలుగు నేర్చుకునే పాశ్చాత్యులకు ఉపయోగార్థం రచించినట్లు పేర్కొన్నాడు. ఈ గ్రంథం జర్మనీదేశంలోని హాలె (Halle) అనే నగరంలో 1747 లో ముద్రించబడింది. (వరుగి అన్నది వడుగి అన్నపదానికి వికృతి. వడుగి అంటే తమిళ భాషా వ్యవహారంలో తమిళనాడుకు ఉత్తర దిక్కున ఉన్న నాడు, జనులు అన్న అర్ధంలో వాడుక చేయబడింది. వడుగిలోని డకారం పాశ్చాత్యుల ఉచ్చారణలో శైథిల్యం పొంది రేఫగా మారింది. వరుగి అంటే తెలుగువారు, తెలుగు భాష అని అర్థం)

1732 నాటికే షూల్జి తెలుగు బైబిలు పూర్తిగా అనువాదం చేశాడు. అది పరిశీలనార్థం హాలి విశ్వవిద్యాలయానికి పంపినా ఏకారణంచేతనో అచ్చుకాలేదు ఆయనకు తిరిగివచ్చినట్టూలేదు, ప్రస్తుతం ఆ ప్రతి హాలెలోని ఆర్ఫన్ (Orphan House) గ్రంథాలయంలో ఉండవచ్చునని తలంపు.[4]

---

1) Carrey, W. H.. Oriental Christian Biography containing distinguished Christians who have lived and died in the east., vol. III P 221 Calcutta, 1852.

2) Ibid PP. 223, 224.

3) Mangamma, J. Book printing in India, P. 9

4. Mangamma, J. P. P. 32, 33.

"The translation of the Bible into Teloogoo languagede, which had been completed in 1732, by the learning and deligence of Mr. Schultze, through not printed till some years afterwords was a work from missionaries anticipated much adventage in their labours in that quarter.[5]

షూల్జి బైబిలు అనువాదం ఎలాఉందోకాని అందులోని కొంత భాగం గ్రమటికా తెలుగికా అనే గ్రంథంలో ఆదికాండకుు, మొదటి అధ్యాయంలోని కొన్ని వచనాలు కన్పిస్తున్నాయి.

ఉదాహరణకు :

1) ఆదిలోను సర్వేశ్వరుడు ఆకాశమున్ను భూమిన్ని కలుగ జేసినారు

2) భూమి వరుస లెనిదింనై వట్టిదింనై వుండెను చికటిలొతు వుండును సర్వేశ్వరుడి యొక్క అరూపి అఇన వారు నిళ్ళ మీద కదులు కొంచ్చూ వుంన్నారు

3) అప్పుడు సర్వేశ్వరుడు ప్రకాశం శాయపడని అని చెప్పినారు అప్పుడె ప్రకాశం శాయపడ్డది

పై వచనాలకు అన్నింటికి తెలుగు అంకెలేవాడడం జరిగింది. భాషాపదాలలో అనవసరమైనచోట పూర్ణానుస్వారాలు సంయుక్తాక్షర ద్విత్వాక్షరాలు ఉన్నాయి. ఈఅనువాదం ప్రాథమికుడైన విద్యార్థి భాషను నేర్చుకొంటున్నట్టు తెలుస్తుందేతప్ప అనుభవజ్ఞుడైన పండితానువాదమని పించదు. భాష కేవలం ఆనాటి వ్యావహారికమని నిర్ధారించవచ్చు.

5. Carrey, W. H. P. 227.

ఫాదర్ హయ్యర్ (Fether Heyer)* 1842లో గుంటూరుకు మిషనరీగా వచ్చినప్పుడు షూల్జి అనువాదపు ప్రతి లండన్‌లో ఉన్నట్లు పేర్కొన్నాడు. [6]

షూల్జి 1742 లో జర్మనీకి తిరిగి వెళ్ళాడు. ఆ నాటికి తెలుగు అనువాదాలు జరిగినా ఏ పుస్తకం కూడా ముద్రణా భాగ్యానికి నోచుకోలేదు. అందువల్ల షూల్జి తెలుగులో గ్రంథాలు ముద్రించాలని నిశ్చయించుకున్నాడు. అప్పటికి భారతదేశంలో తెలుగు మినహా తమిళ, కొంకణి, హిందుస్థానీ తదితర భాషల్లో గ్రంథాలు ముద్రించబడ్డాయి తెలుగు ముద్రణా సౌకర్యాలు భారతదేశంలో లేనందువల్ల జర్మనీదేశంలోని హాలె నగరంలో ముద్రించాలని సంకల్పించి 1746 లో తొలి తెలుగు గ్రంథం అని నేడు పేర్కొంటున్న 'మోక్షానికి కొంచ్చు పొయ్యే దొవ' అనే క్రైస్తవమత గ్రంథం ముద్రించాడు. తొలి తెలుగు ముద్రణా కర్తగా బెంజమిన్ షూల్జికి, తొలి తెలుగు గ్రంథం క్రైస్తవ మత గ్రంథమైన మోక్షానికి కొంచు పొయ్యే దొవ'కు ఆ గౌరవం దక్కుతుంది. షూల్జి రచనలు మొత్తం ఆరు. నాలుగు పుస్తకాల్లో ఆరు శీర్షికల్లో ఉన్న ఈ గ్రంథాలు ప్రస్తుతం బ్రిటీషు మ్యూజియం, లండన్‌లో ఉన్నాయి. క్రింద పేర్కొన్న మూడవ పుస్తకం సిరంపూరు కేరీ గ్రంథాలయంలో భద్రంగా ఉంది.

<u>షూల్జి రచించిన గ్రంథాలు :</u>

1) Via Siva Ordo Salvitis
మోక్షానికి కొంచు పొయ్యే దొవ — 1746
(ఈ శీర్షికలో రెండు వేర్వేరు పుస్తకాలున్నాయి)

---

* ఆంధ్ర ఇవాంజలికల్ లూథరన్ సంఘ స్థాపకుడు.

6) Mangamma, P. P. 32, 33.

2) Catechismus Telugious minor
సత్యమైన వెదంలో వుండె జ్ఞాన వుపదెశాల యొక్క సంక్షెపం.
— 1747

3) Mores Vitamqve Christiano dignam delineantes
బుద్ధిగలిగిన తెలుగువాండ్ల లొపల వొకడొకడికి పుణ్యపుదొవ
చూపించ్చె నూరుజ్ఞాన వచనాల యొక్క చింన్న పుస్తకం.
— 1747

(ఈ శీర్షికలో రెండు వేర్వేరు పుస్తకాలున్నాయి)

4) Colloquim Religiosissimvsm.
వక గురువు అయిదు బ్రాహ్మల యొక్క నడమన కూచన్ండి
వింఢ్లతొను వక్కొండి ఆకాసమున్ను భూమిన్ని ప్రపిప్పించ్చిన
పెద్ద స్వామిమీద ప్రసంగించ్చి తకన్ మిదె.... 1747

ప్రతి పుస్తకంలోనూ లోపలి మొదటి పుట లాటిన్ భాష లోను ఆ తరువాతపుట తెలుగుభాషలోను ముద్రించబడింది. మొదటి మూడున్నూ అనువాదాలు. చివరిది ఆయన స్వీయరచన. మూడవ పుస్తకం సిరంపూరు కేరీ గ్రంథాలయంలోఉంది. (ఆ పుస్తకం మైక్రోఫిల్ము, ఫొటోలు ఈ వ్యాస కర్త వద్ద ఉన్నాయి.)

సిరంపూరు కేరీ గ్రంథాలయంలోని ఈప్రతి పొడవు 16 సెం. మీ., వెడల్పు 10 సెం మీ., మొత్తం పుటల సంఖ్య 63. ప్రతి పుటలోనూ 20 పంక్తులున్నాయి. ప్రతి పంక్తికి 12 నుంచి 14 అక్షరాలున్నాయి. 'టైటిల్' లో పెద్ద అక్షరాలు 0.7 సెం మీ., చిన్న అక్షరాలు 0.3 సెం.మీ. ఉన్నాయి. పుటల సంఖ్యలు తెలుగు అంకెల్లో గుర్తించి ఉన్నాయి. ప్రతి పుటలోను కుడివైపు కింది భాగంలో రాబోయే పుటల్లోని మొదటి అక్షరాలున్నాయి. లిపి సంకేతాలు కొన్ని నేటికి భిన్నంగా ఉన్నాయి. భాష వ్యవహారికం.

ఈ పుస్తకంలోని కొంత భాగం ఉదాహరణకు :

## పరమండల మంత్రం

పరమండలాలలో వుండ్డె మా తండ్రిడి మియొక్క నామదెయం పూజింపప్పం పడునట్టుగాను మియొక్క రాజ్యం రాని మియొక్క చిత్తం పరమండలంలో శాయం పడునడ్లగె భూమిలొనుంన్ను శాయంబడునట్టుగాను వానాట కలుగు మీబొజనం మాకు నెడు యియ్యండ్డి. మాయప్పుల వారికి మెము తాళునట్లె గె మిరున్ను మాయప్పులు మీకు తాళండ్డి మంమ్మున సొదన లా ప్రవెశింపించ్చ కుండ అయితెనూ కీడులొనుండి మంమ్ము రక్షించు కొంద్ది అదె మంటె రాజ్యమున్ను బలమున్ను మహిమనుంన్ను మికు యెన్న టెన్నటికి కలిగివున్నది. అవును. (పుటలు ౭౨-౭౩)

పూర్తి వ్యావహారిక భాషలో రచించిన ఈ గ్రంథంలో భాషా, వ్యాకరణ దోషాలు, లిపిలో మార్పులు నేటికి భిన్నంగా ఉన్నాయి.

పూర్వం ఉట్టంకించిన ఆరు తెలుగు పుస్తకాలతో పాటు రోమన్ లిపిలోకూడా కొన్ని తెలుగు పుస్తకాలు హాలినగరంలోనే ముద్రించాడు. 1747 లో ప్రచురితమైన "Conspecters litteratures Telugioue Velgo wargine" అనే పుస్తకంలో తెలుగు వర్ణసమామ్నాయం, గుణింతాలు, సంయుక్త రూపాలు తెలుగులో ఉన్నాయి. కింద వరసలో రోమన్ లిపిలో ఉచ్చారణ క్రమం చూపాడు. 1728 లో "గ్రమటికా తెలుగికా" అనే పుస్తకం రచించి మద్రాసులో ముద్రించాడు. ఇది 1984 లో జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లికన్ ప్రధాన నగరమైన హాలీలో పునర్ముద్రించారు. ఇదె తెలుగు వ్యాకరణం. ప్రథమాంధ్ర వ్యాకరణంకూడ ఇదే. నూట తొంభై తొమ్మిది పుటలున్న ఈ గ్రంధంలో ఎనిమిది అధ్యాయా

ఉన్నాయి. 1) లిపి (Script), 2) ఉచ్చారణ (Pronounciation), 3) నామవాచకాలు (Nouns), 4) విశేషణాలు (Adjectives), 5) సర్వనామములు (Pronouns), 6) క్రియలు (Verbs), 7) ప్రత్యయములు (Particles), 8) వాక్య నిర్మాణం (Syntax) అని విభజించబడ్డాయి.

1750 లో షూల్జి మళ్ళీ సంభాషణలున్న మరో పుస్తకం తయారు చేసి హాలినుంచే వెలువరించాడు. ఇది కూడా రోమన్ లిపిలో ఉన్న తెలుగు పుస్తకం దైనందిన వ్యవహారాలకు సంబంధించిన సంభాషణలు ఇందులో ఉన్నాయి. యజమానులు, సేవకులు, వంట వాళ్ళు, చాకళ్ళు, దుకాణదారులు మొదలయిన వారి మధ్య జరిగే సంభాషణలున్నాయి ఐరోపాలో తెలియని కాసు, వడ్లు వగయిరా శబ్దాలకు ఈపుస్తకంలో అర్థవివరణలిచ్చాడు. [7]

748 లో జాన్ ఫెడరిక్ ఫ్రిడ్జ్ (Johanan Friedrick Fritz) అనే వ్యక్తి Orientalischurd - Occidentalisches Sprachmeister" అనే పుస్తకం ముద్రించి షూల్జికి బహూకరించాడు. ఇందులో ప్రపంచ నాగరిక భాషల్లోని వందభాషల వర్ణ సమామ్నాయాలు ఉన్నాయి. ప్రభు ప్రార్థన (Lords Prayer)కి సంబంధించిన రెండు వందల భాషల్లో అనువాదాలు కూడా ఉన్నాయి. భారతీయ భాషల్లో తెలుగు, తమిళం, దేవనాగరి, బెంగాలి, మరాఠి మొదలగు లిపులున్నాయి. ఈప్రార్థన అను

7) లక్ష్మణరెడ్డి, స్వాతంత్ర్యానికి పూర్వం తెలుగులో పత్రికా రచన అవతరణ విస్తరణలు. అముద్రిత సిద్ధాంత వ్యాసం, నాగార్జున విశ్వవిద్యాలయం, 1980, పు. 25.

వాదాలు వివిధ ప్రాంతాల్లో మత ప్రచారం చేసే మిషనరీల కోసం రచింపబడినట్టు పేర్కొనబడింది.[8]

బెంజమిన్ షూల్జ్ భారతదేశంలో దాదాపు 23 సంవత్సరాలు మాత్రమే ఉన్నాడు. ఆయన అనారోగ్య కారణాలవల్ల 1742 లో జర్మన్ దేశం వెళ్ళి రకరకాలయిన తెలుగు గ్రంథాలు ముద్రించాడు. షూల్జ్ ప్రచురించిన గ్రంథాలన్నీ దాదాపు ఆయన చేతివ్రాతలే యథాతథంగా చెక్కబ్లాకులు చేసి ముద్రించినట్టు తెలుస్తుంది. మొదటి తెలుగు గ్రంథ ముద్రణం గావించిన షూల్జ్ 1760 నవంబరు 25 న పరమపదించాడు.

భాషాదిక విశేషాలు

అన్ని అంతస్తులవారికి భాష అవగాహన కావాలన్నదే మత ప్రచారకుల మతం అందువల్లనే వారి అనువాదాలలో ఆనాటి నుంచి నేటికీ జనవ్యావహారికాన్నే ప్రామాణికంగా స్వీకరిస్తున్నారు. షూల్జ్ కూడా తన రచనల్లో లేఖన సంప్రదాయాన్ని (Scriptal Tradition) తు. చ తప్పక పాటించాడు. నోటి మాటకు చేతి రాతకు పొంతన కుదిర్చే ప్రయత్నం బాగా సాగింది. ప్రతిశబ్దం, ప్రతిపదం కూడా ఆనాటి ఉచ్చారణకు విధేయమైన లేఖనంలో రచించాడని నిర్ద్వంద్వంగా స్పష్టం చేయవచ్చు. ఈ లేఖన పదం (Spelling) నేటి రచనా పద్ధతికి భిన్నంగా ఉన్నదని కూడా ఒప్పుకోక తప్పదు.

ఇక్కడ మరో విషయం కూడా ప్రస్తావించాలి. ఆంధ్ర దేశం రాజకీయంగా, సామాజికంగా, మతపరంగా ఎన్నో అడ్డంకులు,

8) Mangamma, P. 10

అవాంతరాలు, ఆక్రమణలకు ఆలవాలమై విభిన్న సంస్కృతులను తనలో మేళవింప జేసుకుంది. రాజకీయంగా మహమ్మదీయులు 14వ శతాబ్దిలో (క్రీ. శ. 1324) అడుగు పెట్టిన తర్వాత పారశీక పదాలు భాషా వ్యవహారంలో చోటు చేసుకుని శ్రీకృష్ణదేవరాయల కాలం నాటికి (16వ శతాబ్దం) సమకాలిక శాసనాలతో పాటు కవుల కావ్యాలలో సయితం దర్శనమిచ్చాయి[1]. 15వ శతాబ్దంలో పోర్చుగీసు వారి రాకవల్ల బుడతకీచు భాషాపదాలు దక్షిణాది భాషల్లో యిమిడిపోయాయి.[2] తెలుగులో విడదీయలేనంతగా ఈ భాషా పదాలు ముడివడి పోయాయి.

ప్రకృతం షూల్జి గ్రంథంలోని భాషనుపరికిస్తే ఇందులో ఎక్కడా అన్యదేశాలుకాని, సంస్కృత భాషా భేషజం కాని కానరాదు. ఈ గ్రంథాల పరమ ప్రయోజనం మత ప్రచారం. కనుక ప్రజల పలుకుబడిని రచయిత ఔపోసనపట్టి గ్రంథరచన కావించాడని నిర్ధారించ వీలున్నది అందువల్ల పదలేఖనం (Spelling) లో ఈనాడు మనం వ్రాసేపద్ధతికి భిన్నంగా కొన్ని లక్షణాలు చూడవచ్చు.

1) యకారంబు నను వు వూవో లు తెలుగుమాటకు మొదట లేవన్న చిన్నయసూరి వ్యాకరణ సూత్రాన్ని ఉల్లంఘించిన సందర్భం.

వక క్షణం > ఒక క్షణం

వుసురు > ఉసురు (నూ. జ్ఞా. వ)*

---

1) రాయవాచకము, పీఠిక పు. XX IV, సాహిత్య అకాడమి, 1982

2) దొణప్ప తూమాటి, భాషాచారిత్రక వ్యాసావళి, పు. 214.

* నూ. జ్ఞా. వ. (నూరు జ్ఞాన వచనాల యొక్క చిన్న పుస్తకం. రచయిత. బెంజమిన్ షూల్జి, ప్రచురణకాలం, 1747) దాదాపు ఉదాహరణలన్నీ ఈ గ్రంథం నుంచే ఉట్టంకించడం జరిగింది.

ప్రథమాంధ్ర గ్రంథ ప్రచురణకర్త బెంజమిన్ షూల్జి

వుచ్చులు > ఉచ్చులు

యామరిపాటు > ఏ మరి పాటు

2) పదాదిని దీర్ఘం వాడవలసినచో హ్రస్వం.

నివు > నీవు

3) పదాంతంలో ద్విత్వాక్షరం

మంచ్చి > మంచి

ఇంట్టికి > ఇంటికి

4) మూర్ధన్యానికి బదులు దంత్యాక్షరం.

అద్దగించి > అడ్డగించి

5) సకి బదులు శ

వలశిన > వలసిన

6) వలపలగిలక ప్రయోగాలు

నెపునతో > నేర్పుతో

7) స్వరభక్తి (anaptyxis)

పరామరిశించ్చు > పరామర్శించు.

8) చ కు బదులు శ

శాయకుండా > చేయకుండా

శాయకూడదు > చేయకూడదు.

తామసం శాయకుండ్డా > తామసం చేయకుండా

9) పదమధ్యంలో ఇ కు బదులు అ

సన్నధి > సన్నిధి

10) పదమధ్యంలో దీర్ఘానికి బదులు హ్రస్వం

నిత్యజివనానికి > నిత్య జీవనానికి

11) పూర్ణానుస్వారం అనవసరమైన తావున ప్రయోగించిన సందర్భాలు.

కలవాడుంనై > కలవాడునై

నుంన్ను > నున్ను

12) దీర్ఘము మీద సాధ్య పూర్ణము

దాంచ కూడదు > దాచకూడదు

దాంట > దాట

వాండ్లు > వాళ్ళు

13) అనవసరమైన తావుల్లో సంయుక్తాక్షరం

లేనిద్రి > లేనిది

14) పూర్ణానుస్వారాలు అనవసరమైన ప్రయోగాలు

విశ్వాసాంన్ని > విశ్వాసాన్ని

వుంన్నది > ఉన్నది

కంన్నారు > కన్నారు

కొంన్నారు > కొన్నారు

అంన్న > అన్న

15) పదమధ్యంలో ఉత్వలోపం

గోపరం > గోపురం

16) ఇ ప్రయోగాలు తాం

అ ఇ న > అయన

చచ్చిపో ఇ > చచ్చిపోయి

17) మహా ప్రాణాలకు బదులు అల్పప్రాణాలు

సుకం > సుఖం

18) అల్పప్రాణాలకు బదులు మహాప్రాణాలు

ఛడ్డ > చెడ్డ

గ్రంథ విస్తర భీతి వల్ల ఈ ఉదాహరణలు

—:●:—

# ఈస్టరు పండుగ - ఒక పరిశీలన

క్రైస్తవ మతానుయాయులు ముఖ్యంగా ఆచరించే పండుగలో ఈస్టరు ఒకటి. ఈస్టరునే పునరుత్థాన పండుగ అనికూడ అంటారు. క్రీస్తు చనిపోయి తిరిగి లేచిన సుదినాన్ని పురస్కరించుకుని ఈ పండుగ ఆచరిస్తారు. క్రీ. శ. 8వ శతాబ్దానికి పూర్వం ఈస్టరు పండుగకు సమానార్థకంగా పస్కా అనే పండుగను ఆచరించే వారు. దాస్యం నుంచి విముక్తులయిన ఇశ్రాయేలీయులు వారి స్వస్థలాలకు మరలివచ్చిన శుభసమయాన్ని పురస్కరించుకొని ఆచరించిన ఏడురోజుల పండుగ

పస్కా అనేపదానికి గ్రీకుభాషలోని పస్కా అనే పదం మూలం. హీబ్రూలో పెస్కా, అరామిక్‌లో పిషా. పోర్చుగీసులో పస్కొ, స్పానిష్ పస్కూ, ఫ్రెంచ్‌లో పాక్వెస్ అని అంటారు. అన్ని భాషల్లోనూ దాటిపోవడం అనే అర్థాన్నే సూచిస్తుంది. బ్రౌను మాత్రం పస్కాలాటిన్ భాషా పదం అన్నాడు.

పస్కా పండుగనాడు బలిసిన, మచ్చలేని గొర్రెను చంపి దాని రక్తాన్ని ఆ ఇంటి ద్వారానికి పూస్తారు. మరణదేవత ఆ రక్తం చూసి దాటిపోతుందని వారి విశ్వాసం. ఇక మాంసాన్ని ఆ కుటుంబ సభ్యులు మాత్రమే భుజించాలి. మర్నాటికి మాంసం మిగలకూడదు. అథవా మిగిలినా ఎముకలతో సహా పూడ్చివేయాలి ఒక్క ఎముక కూడా విరగకుండా విందులో భుజించడం ఆనాటి నియమం. ప్రవక్తల ప్రవచనం ప్రకారం మచ్చలేని గొర్రె క్రీస్తుకు గుర్తు. క్రీస్తు సిలువపై చనిపోయింది కూడా ఎముకలు విరుగకుండానే భవిష్యత్తులో జరుగబోయే దానికి ఇది చిహ్నమని పెద్దలు ప్రవచించారు. క్రీస్తుకూడా ఈ పస్కాను ఆచరించినట్లు బైబిలు

ఆధారం. క్రీస్తు చివరి రాత్రిగా తన శిష్యులందరితో కలసి ఏర్పాటు చేసిన విందులో తన రక్త మాంసాలకు చిహ్నంగా ద్రాక్షారసం, రొట్టె ఇచ్చినట్లు స్పష్టం అవుతుంది. నేటికి శుభ శుక్రవారం నాటి ముందురాత్రి ఈ విధంగా క్రైస్తవులు విధిగా ఆచరిస్తారు.

క్రీస్తు సిలువపై మరణించక పూర్వం నలభై దినాలు 'గెత్సమనే' వనంలో ఉపవాస ప్రార్థనలు చేసినట్లు తెలుస్తుంది. ప్రథమంగా ప్రారంభించే దినాన్ని భస్మబుధవారం అంటారు. ఈ భస్మబుధవారం పశ్చాత్తాపానిని, ప్రాయశ్చిత్తానికి ప్రారంభ దినం. పూర్వం యూదులు ఉపవాస ప్రార్థనలు చేయడానికి ముందు శరీరానికి భస్మం దట్టించి, గోనెపట్టాలు చుట్టుకుని ఏకాంతంగా ఏకాగ్రతతో భగవద్ధ్యానం చేసేవారు. ఆ సందర్భంగా బుధవారంతో ప్రారంభమయ్యే నలభై దినాల శ్రమకాలాన్ని (ఉపవాస ప్రార్థన) భస్మబుధవారం అని పేరు పెట్టి ఉండవచ్చు. ఈ మధ్య కాలం వరకు భస్మబుధవారం నాడు మతాధికారి భక్తులపై భస్మం జల్లి ప్రార్థనలు ప్రారంభించేవారు. అర్వాచీన కాలంలో నుదిటిపై నల్లని సిలువ గుర్తువేసి భస్మబుధవారం నాడు ప్రార్థన చేయడం జరిగేది. భస్మ బుధవారంతో ప్రారంభమయ్యే నలభై రోజుల శ్రమల కాలాన్ని లెంటు దినాలు అని అంటారు. లెంటు అనగా ఉపవాసం లేక పశ్చాత్తాపం అని అర్థం ఈ కాలంలో మాంసాహారం ముట్టరు. ఈ ఆచారం క్రీ. శ. 7వ శతాబ్దం నుండి అమలులోకి వచ్చింది.

క్రీస్తు సిలువపై మరణించిన దినాన్ని మహాశుక్రవారం లేదా శుభ శుక్రవారం అంటారు. ఈ మహా శుక్రవారం సాయంత్రం మూడు గంటలకు క్రీస్తు సిలువపై చనిపోయిన సంఘటన అధారంగా అప్పటి వరకు పచ్చిగంగ కూడ ముట్టక భగవద్ధ్యానంలో గడుపుతారు. ఆ సాయంత్రం, మరణించిన పితరుల జ్ఞాపకార్థం

సమాధులు శుభ్రం చేసి శ్రద్ధాంజలి ఘటిస్తారు. శుభశుక్రవారం నల్లని బట్టలు ధరించడం విచారానికి చిహ్నంగా పరిగణిస్తారు. ఆదివారం తెల్లవారు ఝామునే క్రీస్తు చనిపోయి తిరిగి లేచిన సుదినాన్ని పురస్కరించుకొని సమాధులపై పుష్పగుచ్ఛాలుంచి మైనపు వత్తులతో, అలంకరిస్తారు. చనిపోయిన వారు తిరిగిలేచి దివ్య శరీరాలతో పరలోక వాసులవుతారన్నది క్రైస్తవ మత విశ్వాసం.

ఆయా దేశాలవారి సదుపాయాన్ని బట్టి 'లిల్లీ' పుష్పాలు, సీతాకోక చిలుక బొమ్మలు, కోడిగ్రుడ్లు మొదలైన పునరుజ్జీవనానికి చిహ్నమైన వాటిని బహుమతులుగా పంచుకుంటారు. ఈస్టరునాడు అందరూ తెల్లని బట్టలు ధరించి గుడికి వెళ్ళడం సంతోషానికి, ప్రశాంతికి పవిత్రతకూ చిహ్నంగా పరిగణిస్తారు.

